

కాండూరి లక్ష్మీనరసమ్మగారు

# సహృదయుల దీవెనలు

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామిగారు బందరు
B. A. B. E. D., భవ్యభారతి .30-1-57

"మీ స్వామికైంకర్యమునకై స్థాపించిన శ్రీ గోదాగ్రంధమాల తదను గ్రహ విశేషముచేతనే విలసిల్లగలదని యాశింతును"

2 శ్రీ శ్రీనివాస సోదరకవులు,
శతావధానులు, సికింద్రాబాదు 18-2-57

"శుభ సత్సంకల్పమునకు కార్యరూపమైన శ్రీ గోదాగ్రంధమాల భాగవతోత్తముల యాదరమునకు పాత్రమగుగాక"

3 శ్రీ డాక్టరు. యస్వీ జోగారావుగారు, వాల్తేరు
M. A. P. H. D. 20-2-57

"మీ గ్రంధమాలోద్యమము అతి ప్రశంసనీయము"

4 శ్రీ K. V. N. అప్పారావుగారు, కొవ్వూరు
M. A. 30-3-57

"శ్రీ గోదా గ్రంధమాల చేయుచున్న సాహిత్య కృషి అంతయు అభినందనీయము,"

5 శ్రీ సాహిత్యరత్న, అయాచితుల తిరుపతి
హనుమచ్ఛాస్త్రిగారు M. A. (త్రితయ)

10–4–57

"మీరు తలపెట్టిన కార్యక్రమము చాల మంచిది."

6 ఆచార్య చక్రపాణి మహారాజ్, బృందావనము

20–4–57

"మీ మహోన్నత లక్ష్య సిద్ధికై వలయు సాధన సామగ్రిని ఆ గోదా దేవియే సమకూర్చగలదని నా దృఢ విశ్వాసము."

7 శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు M. A., విజయవాడ

24–5–57

"శ్రీ గోదా గ్రంథమాలకు మంచి భవిష్యము గలదని నమ్ముచున్నాను."

8 శ్రీమాన్ గొట్టుముక్కల రమాకాంతాచార్యులుగారుB. A.
విజయవాడ

26–6–57

కం॥ "గోదా లక్ష్మీ కరుణా
స్వాదు భవత్కృతి ప్రసూన సన్మాల బుధా
మోదము గూర్చుట వింతయె
శ్రీ దయికుడు నీ కొసంగు శ్రీయును యశమున్."

9 శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు, నెల్లూరు
5-7-57

"పిన్న పెద్దల యంతరవులు, ప్రాచీన సంప్రదాయములు అంతకంత కడుగంటుచున్న యీ కాలమున లోక కల్యాణైక దృష్టితో వ్యయ ప్రయాసలకోర్చి గురుభక్తి, దైవభక్త్యుద్బోధకములగు పవిత్ర రచనలు శ్రీ గోదా గ్రంథమాలలో వెలయింప సమకట్టిన మీ సౌమనస్యము జగత్శ్లాఘ్యము."

10 శ్రీ. యస్. రాధాకృష్ణన్‌గారు, న్యూఢిల్లీ
ఇండియా వైస్‌ప్రెసిడెంటు 4-8-1957

"మీరు పంపిన పుస్తకములు చదివితిని. మీ సారస్వత సేవకు సంతోషము."

11 శ్రీ ఎ. ఫణీంద్రుడుగారు, హైదరాబాదు
డిప్యూటీ డైరెక్టరు: విద్యాశాఖ 1-1-58

"గోదా గ్రంథమాల ద్వారా మీరింకను సారస్వత సేవ చేయుదురు గాక యని కోరుచున్నాను."

12 శిరోమణి శ్రీమాన్ చలమచర్ల రంగాచార్యులుగారు,
హైదరాబాదు
6-1-58

"మీ గ్రంథ ప్రకటన కృషి యెంతయు ప్రశంసనీయము."

13 శ్రీ ఓరుగంటి రామచంద్రయ్యగారు వాల్తేరు
M.A. Hnors, P. Hd 22-2-58

"శ్రీ గోదా గ్రంథమాల ద్వారా మనోవాక్కాయములచే శ్రీమన్నారాయణు నంజలించుచున్న మీరు.సుకృతులు"

శ్రీమాన్ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ గారి లేఖ

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు గారికి,

మీరు సప్రణయముగా పంపిన 'త్రివేణి' అందినది. ధన్యవాదములు. సాంతముగా చదివి సంతోషించితిని. శ్రీశర కోప చరిత్రమున మీ కావ్యరచనాశిల్పము క్రమపరిణతమై అందగించుచున్నది. మీరు సాధించుచున్న సంగీత సాహిత్యుల సౌరభ మిందు ప్రతి పద్యమందును మారు పల్కు-చున్నది. 'శంఖఫలకము' శంగప్పలహై అను తమిళమునకు సరియైన తర్జుమా కాదనుకొందును. శంఖమున కందు సంబంధము లేదు. ద్రావిడ ప్రాచీన పండిత సంఘము కావ్యము విలువ గట్టుటకై పెట్టుకొన్న దివ్య ఫలక మది-

శ్రీయుతులు జగన్నాథ తిరువేంకటాచార్యుల వారి పరాంకుశ శతకము ప్రామాణిక సంప్రదాయార్థములు నిండిన గంభీర రచన. వారి పాండిత్య శ్రద్ధలు ఇందు స్పష్టముగా ప్రతిఫలించుచున్నవి.

శ్రీనల్లాన్ చక్రవర్తుల వేంకట రాఘవాచార్యుల వారి తెలిగింపు చాల మధురముగా, ధారాళముగా నున్నది.

రా. అనంత కృష్ణశర్మ.

తిరుపతి<br>14-5-1958

# త్రివేణీ ప్రశంస

1. ఈ యిల నూర్ధ్వలోకముల నేకము చేయు హిమాలయాన గం
గాయమునా సరస్వతు లఖండ గతింజనియించి ఏకమై
పోయిన రీతి, సత్కవులు ముగ్గుర, కావ్య సుధారసమ్ములీ
తీయని సంపుటమ్మునను తేజరిలన్ చెలగెన్ త్రివేణిగా

2. అమృతంపు గనియైన అమర వాణికి క్రొత్త
లలితత్వ మొలయించె తెలుగు బాస
లలితాతి లలితమౌ తెలుగు బాసకె క్రొత్త
చెలువమ్ము వెలయించె జిలుగు కైత
చెలువమ్ము లెగజిమ్ము జిలుగు కైతను క్రొత్త
వెలుగుల నలరించె విష్ణుభక్తి
విమలాతి విమలమౌ విష్ణుభక్తికి క్రొత్త
కోమలత్వము శఠకోపచరిత
అట్టి శ్రీశఠకోప మహాత్వ మాంధ్ర
భాష రచియించి సత్కవుల్ వంద్యులైరి
దీని కృతినంది సద్గురుల్ దివ్యులైరి
తెనుగు వాణికి కొంగ్రొత్త తేజమొదవె.

3. విచ్చుచు విచ్చుచున్న అరవిందమునందలి పచ్చి తేనియల్
మచ్చరికించు భావములు, మంజుల మోహన ముగ్ధశైలి గో
ర్వెచ్చని పాలమీగడల బింకము పొంకమడంచు భాష నే
మెచ్చిన మెచ్చులా? జగమె మెచ్చి త్రివేణిని గారవించు॥

4. విన్నది భక్తగాథ వినిపించి నతండు నృసింహసూరి నే
నెన్నగజాల వ్రాసిన కవీంద్రుల దివ్య కవిత్వశక్తి మా
కన్నివిధాల సంతసమె యబ్బెను సత్కవిచంద్రులార! మా
కన్నులపండువయ్యె కవి కాంతుల జన్మము ధన్యమయ్యెగా.

5. జనకుడు పుత్రుడున్ సత్కృతి సంస్కృతమందున నాంధ్రమందునన్
ఘనతర పాండితీ మహిమను గల్గిన వారలై, భక్తగాథ స
జ్జన మతిభాజనంబయిన చక్కని పద్దెలు లిఖించి పెన్గ బా
సను పరిపుష్టమున్ సలుపు సత్కవు లర్హులు మా నమస్కృతుల్.

6. తనకృతికన్యకున్ దగ సుశాంత్రశ్రీ కవిత్వ కుమారయున్ ముద
మ్మున వరియుక్త కాలకరమున్ గ్రహియించి కవీంద్రులెల్ల రా
వని కొనియాడునట్లు సహృదయుంగవ నృత్త్యముచేయ జూచియే
జనకుడు సంతసమ్ము గనజాలడు కృష్ణ కవీంద్ర తెల్పుమా!

7. నను మీకున్ మిము నాకు దెల్పి మనకున్ సఖ్యమ్ము చేకూర్చు మి
త్రుని కొండూరి నృసింహుని నెన్నుదున! సంతోషాబ్ధిలో నోలలా
ర్చిన మీ సత్కవితామృతమ్మును ప్రశంసింపంగనౌనా! ఫలిం
చెను నా భాగ్యమటంచు మాధవునకున్ గేమోడ్పు లర్పింతునా!

8. కావ్యమునకు ప్రచారమ్ము కలుగుగాక!
కావ్యకర్తలకు ప్రశస్తి కలుగుగాక!
కావ్యభర్తలకును కీర్తి కలుగుగాక!
తెలుగుతల్లికి మంగళం బలరుగాక!

శఠకోపజయంతి,
విజయవాడ,
31-5-53.

ఇట్లు,
కాకాని నరసింహారావు
ఆంధ్రనలంద ఆస్థానకవి,
గుడివాడ.

# మనవి

భక్తామృతం విశ్వజనానుమోదనం,
సర్వార్థదం శ్రీ శఠకోప వాఙ్మయం,
సహస్ర శాఖోపనిష త్సమాగమం,
నమామ్యహం ద్రావిడ వేదసాగరమ్.

శ్రీయఃపతి లీలలు చిత్రాతిచిత్రములు
"నీ పెద్దలు గూర్చిన నిక్షేపమ్మిది కొమ్మటంచు
శ్రీరంగపతి శ్రీపదయుగ్మము చూపిన"

అని ఆముక్తమాల్యదలో పల్కినట్లు మా పితృదేవులు ప్రపన్నజన కూటస్థులగు నమ్మాళ్వార్లు అనుగ్రహించిన ద్రావిడవేద సాగరమగు తిరువాయ్‌మొళిని బాల్యమునసే నేర్పిరి. ఇదియే మీకై మేము కూర్చిన పెన్నిధియని ఆనతిచ్చుటయేగాక దీనిని బహుళ ప్రచారమునకు తేవలెననిగూడా శాసించిరి.

ఆచార్య కటాక్షముచే సర్వార్థదమగు నా తిరువాయ్‌మొళి మీదను, తత్కర్తయగు నమ్మాళ్వారులమీదను మా కమిత భక్తిశ్రద్ధ లేర్పడినందున వారి చరిత్రను, శ్రీసూక్తులను, ఆంధ్రలోకమున విరివిగా వ్యాపింపజేయవలెనని మాకు సంకల్పము కల్గినది.

ఈ యుద్దేశ్యముతోనే సుహృద్వరులును సంగీతసాహిత్య కళానిధియునగు శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులవారిని ఈ నడుమనే నమ్మాళ్వారుల చరిత్ర మొక పద్యకావ్యముగ వ్రాసి యిండని ప్రార్థించితిమి. వా రాపని స్వల్పకాలమున పూర్తిచేయుటయేగాక దానిని మా తండ్రులకే అంకితము చేయుటగూడా మా సుకృతమే. దీనికి తగిన ప్రత్యుపకార

మేమియుచేయలేకపోయినను ఈ కవిలోకచంద్రుని కాయురారోగ్యైశ్వర్యములిచ్చి కాపాడుమని మా స్వామిని త్రికరణశుద్ధిగ ప్రార్థించుచున్నాను.

ఈ నమ్మాళ్వారులకే శఠకోపులనికూడా ప్రసిద్ధ నామము కలదు. విష్ణ్వాలయమునకేగి మనము స్వామిని సేవించునపుడు శఠకోపమునుగూడా శిరసున ధరింతుముగదా! అట్టి శఠకోపము విలువయెట్టిదో చెప్పవలెనా? ఈ శఠకోపులే ఆ శఠకోపమని చెప్పిన సామాన్యులకు ఆశ్చర్యము గలుగక మానదు. నమ్మాళ్వార్లు శ్రీ మహావిష్ణువుకు పాదస్థానీయులు కావలెనని కోరిరి. ఆ విధముగనే కాగలిగిరి. శఠకోప మనగా విష్ణుపాదములని భావము. శఠకోపముపై విష్ణుపాదము లుండుట చాలమంది గమనించియే యుందురు.

జగత్ప్రభువగు శ్రీమన్నారాయణునకు శఠకోపులు పాదస్థానీయులు కాగా విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకులగు శ్రీమద్రామానుజాచార్యులవారు ఆ శఠకోపులకు పాదస్థానీయులైనారు. కాన శ్రీ రామానుజులద్వారా శఠకోపులను, వారిద్వారా శ్రియఃపతిని ఆశ్రయించిననే భవదవాగ్నిసంతప్తులగు బద్ధజీవులకు మోక్షము కరతలామలక మగును. కాన అట్టి మహాత్ముల చరిత్రాంశములు తెలిసికొనుట మన కత్యంతావశ్యకము.

మాకు తమ చరిత్రను ఒక కవివరేణ్యుని వాక్కుద్వారా ఆంధ్రదేశమున వెలయింపజేయవలెనను సంకల్పము కలుగగనే వికల్పము లన్నిటిని పారద్రోలి యీ ప్రపన్నజన కూటస్థులగు శఠకోపులే దీని నిట్లు అచిరకాలమున వెలువరింపజేసినారు. ఇట్లే విశిష్టాద్వైతసిద్ధాంత జీవాతువగు శ్రీ రామానుజులుగూడ గద్యప్రబంధరూపమైన తమ జీవిత చరిత్రమును యీ గ్రంథమాలనుండి మాచే త్వరలో వెలువరింపబడునట్లు కటాక్షింపవలెనని ప్రార్థించుచున్నాము.

భాగవత శిఖామణులుగూడ నీ గ్రంథమాలకు పఠన పాఠన ప్రచారములద్వారా దోహదమొసంగిననాడే యిది సాధ్యము కాగలదని వినీతులమై మనవి చేయుచున్నాము.

ఈ గ్రంథమాల ప్రథమపుష్పమగు అంజలిలో గోదాదేవి చరిత్రను, ఆమెస్తుతిని ఆమె నిబంధించిన తిరుప్పావు అనువాదమును ప్రచురించి మేము లోకమాత యనుగ్రహము సంపాదించుకొంటిమి. ఇపుడు శ్రీ నమ్మాళ్వార్ల యభిమానమును భాగవతోత్తముల యనుగ్రహమును సంపాదించుకొనుటకై ద్వితీయ గ్రంథముగా నీ త్రివేణిని ప్రచురించుచున్నాము. ఇందు తిరువాయిమొళికి అనువాదమగు శఠకోప గీతామృతమునందలి వేయి పద్యములలో మచ్చునకు కొన్ని పద్యములు మాత్రమే ముద్రించితిమి. పుస్తకము సాకల్యముగ పరిశీలింపదలచినవారు తూర్పుగోదావరిజిల్లా, తుని; గ్రంథకర్తకు వ్రాసిన బడయగలరు. ఈ సంపుటిలో తమతమ గ్రంథములు వాత్సల్యముతో ప్రచురించుకొన నంగీకరించిన ఉ-వే-ప్ర- శ్రీమాన్ తి. న. చ. సం. జ. తిరువేంకటాచార్య స్వామివారికిని, ఉ-వే-ప్ర శ్రీమాన్ డాక్టరు నల్లాన్ చక్రవర్తుల వేంకట రాఘవాచార్యులవారికిని మిగుల కృతజ్ఞులము. ఈ గ్రంథమాలకు కావలసిన వ్రాతప్రతులు విసుగుకొనకుండ వెంటవెంటనే తయారుచేసి యిచ్చుచున్న మిత్రులు ఘంటసాల బోర్డుహయ్యర్ ఎలిమెంటరీ బాలికా పాఠశాల సంగీతోపాధ్యాయులు శ్రీ మద్దిపట్ల వెంకటలక్ష్మీనరసింహముగారికి మా అభివందనములు. దయతో అభిప్రాయమొసగిన శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారికిని, ప్రశంసా పద్యములు వ్రాసియిచ్చిన శ్రీ కాకాని నరసింహారావుగారికిని మా ధన్యవాదములు.

ఇట్లు

భాగవత చరణరేణువులు,

సంస్థాపకులు:

శ్రీ గోదా గ్రంథమాల.

# నమ్మాళ్వార్లు

వకుళా భరణం వందే జగదా భరణం మునిం
యశ్శ్రుతే రత్తరగం భాగం చక్రే ద్రావిడ భాషయా.

దక్షిణ దేశమున తామ్రపర్ణి యను నది కలదు. ఆ నదీ తీరమున కురుకాపురియను నగర మొకటుండెను. అందు కారియను పరమ భాగవతోత్తము లొకరు నివసించుచుండిరి. వారు నాథనాయికి యను తమ దేవితో ఒకపరి తమ మామగారి యింటికేగిరి. అచటనుండి తిరిగి వచ్చుచు తిరుక్కురుం గుడి అను గ్రామమునకువచ్చి అందలితిరుక్కురుంగుడి నంబి అను దేవునకు సాష్టాంగ పడి "స్వామీ! మాకుసంతానము ప్రసాదింపుడ"ని ప్రార్థించిరి. అపుడా పెరుమాళ్లు విష్వక్సేనులకు 'ఆ కారి దంపతులకు కుమారుడవై అవతరింపుము' అని ఆదేశించిరి.

అంత నా దంపతులకు కలియుగాది 44 వ దినమున ప్రమాది వత్సర వైశాఖ మాసమున శుక్లచతుర్దశినాడు, విశాఖా నక్షత్రయుత కటక లగ్నమందు ఒక శిశువుకలిగిరి. వారే నమ్మాళ్వార్లు. ఆశిశువు ప్రాకృతబాలునివలె ఏడ్పును స్తన్యపానాదులు లేక బాల సూర్యుని వలె దిన దిన ప్రవర్ధమానులగుచుండిరి.

తలిదండ్రులు లాబాలుని అప్రాకృతుడని నిశ్చయించి కురుకాపురి ఆదినాథస్వామి ఆలయ ప్రాకారములోనున్న చింతచెట్టు తొట్టిలో వదలివేసిరి. ఆ చింతచెట్టు అంతకుముందే ఆదిశేషుని యంశమున నమ్మాళ్వార్ల రక్షణకై యేర్పడి యుండెను. అచటనే యా శిశువు తన 16వ వత్సరము వరకు అన్నపానాదులు వదలి భగవద్గుణమును గానము చేయుచు నిమీలిత నేత్రులై జ్ఞానముద్రతో కాలము గడుపసాగిరి.

ఒకప్పుడు మధురకవియనుభక్తులు తీర్థయాత్ర సేయుచు అయోధ్యలో నుండగా ఒకరాత్రి దక్షిణ దిక్కున వారికొక గొప్ప జ్యోతి కాన్పించెను.

వారు దాని కబ్బుకపడి దానిని పరిశీలింపదలచి బయలుదేరి రాత్రులందు ఆ తేజస్సుగల దిశకు ప్రయాణము చేయుచు, కొంతకాలమునకు కురుకాపురి చేరిరి. అచట యిక నా తేజస్సు కానుపింపలేదు. వారు ఆ గ్రామస్థుల నడిగి నమ్మాళ్వార్ల విషయమును, ప్రభావమును తెలిసికొనిరి. అనంతరము మధుర కవులు ధ్యాన యోగముతో బద్ధ పద్మాసనస్థులై వేంచేసియున్న నమ్మాళ్వార్లను సందర్శించి వారు మహా ప్రాజ్ఞులని తెలిసికొని వారి శుశ్రూష చేయుచు వారి సన్నిధినే నివసింప సాగిరి.

సర్వేశ్వరుడు నమ్మాళ్వారుల యోగసాధనకు భక్తి ప్రపత్తులకు ప్రీతుడై నందున శ్రీ భూ నీళా సమేతుడై సమస్తపరివారముతో గరుడవాహన మారోహించి వచ్చి వారికి సేవ సాయించిరి. అప్పుడు నమ్మాళ్వార్లు ఆ స్వామిని సేవించి వారి దివ్య మంగళ విగ్రహమును, కల్యాణ గుణములను చక్కగా ననుభవించిరి. అప్పుడు భగవంతుని నిర్హేతుక జాయమాన కటాక్షముచే వారికి దివ్యజ్ఞానములభించెను. కావనే ఆ యనుభవము వాగ్రూపమున వెలువడెను. మొదట ఋగ్వేద సారమగు 100 పాశురములు (పద్యముల) తిరు విరుత్తమును, యజుర్వేద సారమగు 7 పాశురముల తిరువాశిరియమును, అధర్వణ వేదసారమైన 87 పాశురములు గల పెరియ తిరువందాదియు అనుగ్రహించిరి. తరువాత సామవేద సారమైన 1102 పాశురములు గల "తిరువాయ్‌మొళి" అను ఈ చరమ ప్రబంధమును నిబంధించి లోక సంగ్రహార్థమై తమ శిష్యులు మధుర కవుల ద్వారా దీనిని ప్రపంచమున వ్యాపింప జేసిరి. "తిరువాయ్‌మొళి" అనగా 'భగవత్కటాక్షముచే జనించిన వాగ్ధారణి' అని అర్థము.

అప్పుడు నమ్మాళ్వార్ల అలౌకిక మాహాత్మ్యము విని పరమ పదవాసులగు నిత్య సూరులును, బ్రహ్మాది దేవతలును కూడా వారివద్దకు వచ్చి చూచి ఆశ్చర్య పడిరి. వీరి కవితా మాధుర్యమునకు ముగ్ధులై, తిరుపతి, శ్రీరంగము, కంచి, మొదలగు 108 దివ్య దేశము లందున్న పెరుమాళ్ళను వారిని దర్శింపచుటకు వచ్చిరి. 'మామీద కవిత్వము చెప్పుడని- మామీద కవిత్వము చెప్పు

డని ఆ దేవులందరు చుట్టును చింతకొమ్మలను పట్టుకొని నిలబడి నమ్మాళ్వారను ప్రార్థించిరి. అప్పుడా విష్ణు దేవుల నందరిని నమ్మాళ్వార్లు తమ భగవదనుభవ వాహాపరీ రూపమగు పాశురములతో, స్తోత్రము చేయగా వారందరును కృతార్థులై సంతోషముతో తమ తమ స్థలములకు మరలిరి.

ఈ విధముగ అతి మానుష వైభవముతో నమ్మాళ్వార్లు చేతనుల నుద్ధరించుచు 35 సంవత్సరము లీ భూమిపై నివసించి యాచంద్రార్క స్థాయిగా తమ కీర్తి పతాకయగు తిరువాయ్మొళిని, ఈ లోకమున నిలిపి తనువు చాలించి పరమపదమునకు వేంచేసిరి.

అనంతరము వీరి శిష్యులు మధుర కవులు వీరి విషయమై ఆచార్య ప్రతిపత్తిని బోధించు 'కణ్ణినుణ్ శిరుత్తాంబు' అను పదునొకండు పాశురముల ప్రబంధము రచించిరి. అచట నమ్మాళ్వార్లను అర్చారూపమున ప్రతిష్ఠించి వారినే సేవించుచు యావజ్జీవము కాలము గడపిరి.

వీరికి గల నామాంతరములు 1 వకుళభూషణులు 2 శఠకోపులు. 3 పరాంకుశులు 4 మారులు.

1. వృషభేఽపి విశాఖాయాం, కురుకాపురి కారిజం
పాండ్యదేశే కలేరాదౌ శఠారిం సైన్యపం భజే

2. మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన మదన్వయానాం
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామిమూర్ధ్నా॥

# కవి పరిచయం

జననము 1923. కాపురస్థలము విజయవాడ. బాల్యముననే తండ్రిగారియొద్ద సంస్కృతాంధ్ర భాషాభ్యాసము. పదియేడవయేటనుండి సంగీత విద్యాభ్యాసము. 1948 నుండి విజయవాడ ఆలిండియా రేడియో నిలయమున సంగీత విద్వాంసులు.

ఫిడేలువాద్యమున ప్రవీణులైన దాక్షిణాత్య తరుణులలో అగ్రపంక్తి నధిష్ఠించినవారు. సంగీత విద్వాంసులకు సాధారణముగా నుండని చక్కని సంస్కృత సాహితీపటిమ వీరికి గలదు. తెలుగులో చక్కని కవితాకళికను పెట్టిపుట్టినవారని యీ మృదుమధుర సరసకావ్యము చదివినవారు గ్రహింప గలరు. సంగీత-సాహిత్య కళల పరస్పరోపకారము వీరి రచన లన్నిటి యందును ప్రతిఫలించుచుండును.

ఇతర రచనలు : 1. త్యాగరాజ చరిత్ర (ముద్రితము)
2. ఆంధ్ర భజయతి రాజస్తోత్రము.
3. నారాయణ శతకము.

## —* ఆకాంక్ష *—

శ్రీత్యాగరాజ చరితాధిగతం యశోమాం
భూయః ప్రచోదయతి కావ్య నిబంధనాయ
తచ్ఛ్రీశతారి చరితం రచయామి పుణ్య
మేత త్కరోతు బుధవర్గ ముపాత్త హర్షమ్.

# న మ్మా ళ్వా రు లు

యద్గోసహస్రమపహన్తి తమాంసి పుంసాం.

నారాయణోవసతి యత్ర సశంఖచక్రః



యన్మండలం శ్రుతిగతం ప్రణమంతి విప్రాః

తస్మై నమో వకుళభూషణ భాస్కరాయ.

చించాకోటరమధ్యవాస రసికున్ సేనార్థిసంతారకుం
బంచార్థ ప్రతిపాదక ద్రవిడనామ్నాధుర్య రత్నాకరున్
గాంచీ రంగ వృషాద్రి నేవగిరి ముఖ్యక్షేత్ర దివ్యస్థలో
దంచత్ఖ్యాతి నిదానభూతు శఠజిత్స్వామిన్ ప్రశంసించెదన్.

— తి॥ న॥ చ॥ సం॥ జ॥ తిరువేంకటాచార్యులు.

కృతిపతులు



శ్రీ కొం॥ తి॥ జగన్నాధాచార్యులు



శ్రీ పంచాంగం శఠకోపాచార్యులు

# శ్రీ శఠకోప చరిత్రము

## —: అంకితము :—

ఆ నాఁడొక్క శుభాహ మాదినమునం దభ్యాగతుం డయ్యె మ
త్రాణాప్తుండు వివేకశాలి నరసింహార్యుండు కొండూరి సం
తానాంభోధి సుధాకరుండు కవి హృత్పంకేజ మిత్రుండు కా
వ్యానందైక రసానుభూతి పరిధూతాన్య క్రియా క్లేశుఁడున్.

మనసిడి మాటలాడు మతిమంతుఁడు వీత రజ స్తమస్కుఁ డే
మనుజునినైన నొక్కక్షణమాత్రము నెయ్యము సేసినంత లోఁ
గొనియెడు వాఁడు దాఁ దలచుకొన్న పనిన్ నెరవేరుదన్క వీ
డని సుదృఢవ్రతుండు కమలాపతి భక్తి వినిశ్చలాత్ముడున్.

ఆతఁడు మిత్రమౌట జననాంతర సంచిత భాగ్యమొండె, ని
ర్హేతుక జాయమానమగు శ్రీహరి దివ్యకటాక్ష మొండె, ధీ
చాతురినై వచించెను ప్రసంగవశమ్మునఁ 'గృష్ణమార్య నీ
కైతకు నాదుమానసము కైవసమయ్యె నెఱుంగు దీవుగా! 3

సంగీత విద్యలోఁ బా
రంగతుఁ డీవగుటఁ ద్యాగరాజ చరిత్ర
మ్మం గోరి వ్రాసి విద్వ
త్పుంగవ మహితాభిమానముం గొంటివిగా. 4

ఇమ్మహి నీ వైష్ణవ జ
న్మమ్మం జరితార్థముగ నొనర్పఁ దలఁచినన్
నమ్మాళువారి చారి
త్రమ్మును రచియింపు ముభయతారక మగుఁగా!' 5

అట్లు శ్రీ నరసింహార్యు నాజ్ఞ వడసి
కావ్య రచనమునకు నుపక్రమము సేయు
వేళ మామక మానస వీధియందుఁ
దోఁచె నొక దివ్యమైన యాలోచనంబు. ౬

కృతి తిరమై మనుటకుఁ గృతి
పతియున్ సుశ్లోకుఁ డగు టవశ్య మనెడి పం
డితవాక్యమునం బ్రత్యయ
మతిఁబో భాగవతసత్తము ప్రీతి నొయిన్. 7

హారితస గోత్రమం దుదయమందిరి తోయధిఁ బుష్పవంతుల
ట్లిరువురు సోదరుల్ సతత మేధిత సచ్చరిత వ్రతుల్ నిరం
తర హరినామసంస్మరణ తత్పరు లుజ్జ్వల సత్త్వమూర్తు లం
దిరవుగ ఖ్యాతిఁ గాంచె నల జ్యేష్ఠుఁడు శ్రీశఠకోప సంజ్ఞచే.

పెరియాళ్వారివలె నా
గురువాళి యనారతం బకుంఠితగతి శ్రీ
హరి కైంకర్యా సక్తుఁడుఁ
బరాఙ్ముఖుఁడు నైహికార్థ వాంఛల యందున్. 9

పటేటం బచరించె భద్రగిరి యం దెంతేనిఁ గైంకర్య ము
చ్చోటన్ స్వామి కలంకరించెను గడున్ సొంపైన భూషా
వళుల్ చాటెన్ రాముఁడే దైవమంచుఁ గలకాలంబుం దదీ
యార్చ్చ కేయూటంకంబు ఘటిల్లకుండ నిడెఁ బర్యాప్తమ్ముగా
ద్రవ్యమున్. 10

క్షితిజాపతి పదసేవా
రతి యతి మాత్రమ్ము గాగ రాజద్భద్ర
క్షితి ధర ధాముని రామునిఁ
బ్రతిష్ఠితుని జేసె నుల్లిపాలెము నందున్. 11

త త్సమర్చనముల జీవితమ్ము నెల్లఁ
గడపె శఠకోపగురుడు తత్క్రమగు ననె త
దాత్మజుఁడు వీరరాఘవార్యమణి రమణి
మంగతాయారు సేవింప మనుచు నుండె. 12

మఱియు శఠకోపగురుని సోదరుఁడు వరుఁడు
శ్రీజగన్నాథ నామ విభ్రాజితుండు
సదమలాంతఃకరణుఁడు సాజమగు బత్తి
యత్తిన ఘనుండు నుభయవేదాంత విదుఁడు. 13

ఆచాంతమ్ములు ద్రావిడాగమము, భాష్యార్థంబు కాంతూరిరం
గాచార్యాంఘ్రి సరోజ సేవనముచే నభ్యాసనికిన్, సౌహృద
ప్రాచుర్యమ్మునఁ దీర్చిదిద్దెఁ బలు ఛాత్రవ్రాత మాధీయుతుం
డే చాంచల్యము లేక శౌరి భజనమ్మే చేయు నెవ్వేళలన్. 14

శ్రీనారాయణు నుల్లిపాలెమున సుప్రీతిం బ్రతిష్ఠించి ని
త్యానందమ్మును గాంచె వాని వరివస్యా వైభవప్రాప్తిఁ ద
త్సూనుండే నరసింహాసూరి నను సక్తుం జేసె నిక్కావ్య ని
ర్మాణమ్మం దతఁడెచ్చటం బ్రకటితారంభుండె కాయిద్ధరన్.

స్థాపించెన్ జననీప్రియంబు మెయి గోదా గంధమాలన్,సమా
రోపించెన్ జనకప్రతిష్ఠిత నిరాంబ్వరం సేవనార్థమ్ము, ని
క్షేపించెన్ బుధలోకచిత్తముల నిస్సీమాభిమానమ్ము, సం
దీపించెన్ గడు రాఘవమ్మ యను సాధ్వీరత్న మిల్లాలుగన్ 6

ఇంపుగాఁ బురాణములను విన్పించు బుద్ధి
శాలి సాహిత్యరత్న భాషాప్రవీణ
బిరుదములు గొన్నవాఁడు శోభనహితుండు
నార్య విహితుండు శ్రీనృసింహార్య వరుఁడు. 17

అట్లు విస్ఫార విఖ్యాతి నందుకొన్న
యా సుకృతికి వేంకటరాఘవమ్మ రంగ
నాయకమ్మయు మఱి లక్ష్మినరసమాంబ
యనఁగ మువ్వురు సోదరీమణులు గలరు. 18

అనుజుని యుద్యమంబులకు నన్నిటికిన్ సయిదోడులౌచు శ్రీ
వననిధి కన్యకారమణ పాదసరోరుహ సేవ నమ్మ జీ
వనమని విశ్వసించి బహుభంగుల స్వామికి భూరి విత్త మ
ర్పన మొనరించి శ్లాఘ్యమగుపద్ధతిలో మనుచుండి రాయమల్

ఏత దన్వయ మహితు నే నెఱిఁగియుంటఁ
జిరతర యశోవపుర్విభాసితులు దీవ
నఘులు శఠకోపగురు జగన్నాథ గురుల
కర్పణము జేతు నాదు కావ్యమ్ము భక్తి. 20

—o—

# శ్రీ శఠకోప చరిత్రము

## —* స్తుతి *—

ధరణిఁ గలట్టి మానవు లధర్మ వశంవదులై జనించుచున్
మరణమునందుచున్ భవమునంబడి మ్రగ్గుచునుండఁ దత్సము
ద్ధరణ చికీర్ష నూల్కొన పదాన్యుల ధన్యులనాళువారులన్
ధరఁ బరగంగఁ జేసిన యుదారమతిం బ్రణుతింతు శ్రీపతిన్. 1

హరి కరుణామయుం డనిశ మైనను వాని మనఃప్రవృత్తి యే
సరణిగ మారునో యనెడి శంకను బాపఁగ భక్తరక్షకై
కర మనుకంపపైఁ బురుషకారము దప్పక చేయుచుండు నా
సిరి మొదలైన విష్ణు మహిషీనివహమ్ము మదిం దలంచెదన్ 2

గణనాతీతము లబ్జనాభు సుగుణౌఘమ్ముల్ ప్రశంసింపఁగన్
ఫణముల్ వేయిఁటేఁ దాల్చెనో యన యనల్పక్షాంతి శేషత్వల
క్షణ లక్ష్యుండయి వానిసన్నిధిఁ బ్రతీక్షం జేయుచున్ సర్వస్వా
ర్పణముం జల్పినధీరుఁ బన్నగకులాలంకారుఁ బ్రార్థించెదన్

వాసవు గెల్చి వే యమృతభాండముఁ దెచ్చి మొసంగి తల్లికిన్
వాసిగఁ బారతంత్ర్యమెడఁబాపిన జిత్వరు హాటక ప్రభా
భాసి గరున్మరు ద్వ్యధుత పాపధరాధరు ఖగాధు సంతత
శ్రీ శనిషేవణోద్ధురు ఖగేశ్వరు నామది నుగ్గడించెదన్ 4

విఘ్నవారణ నిఘ్నులౌ విఘ్నరాజ
ముఖ్యు లెవ్వాని శాసనమ్మున దనర్తు
రట్టి సూత్రవతీ మనోహరుని వేత్ర
ధరుని హరి చమూ నాయకవరునిఁ దలఁతు 5

జనతతి సంసృతిం దవిలి జ్ఞాన మొకించుక లేక హేయక
ర్మనిరతులౌచు ధూమమయ మార్గమునం జనఁ గాంచలేక వే
దనిహితమైన యర్థముల ద్రావిడమందుఁ బ్రసంగఁజేసి యి
చ్చిన మహనీయులం దలఁతుఁ జిత్తమునం బదిమందిసూరులన్

హార్యంఘ్రి సరోరుహ సక్తిం
కర్యమె తమ జీవనమ్ము గాఁగ నరుల స
చ్ఛిష్యులఁ జేసిన పూర్వా
చార్యులకుం గేలు మోడ్తు సదమల భక్తిన్. 7

భువిలోనం గల దుర్మతమ్ముల వడింబోకార్చి యెచ్చోటనై
ష్ణవభక్తి ప్రతిపత్తిఁ గీల్కొలిపి వ్యాసబ్రహ్మసూత్రాళికిన్
నవభాష్యంబురచించి శౌరిపదమున్ బ్రాపింపఁగాఁ జేయు మం
త్రవరం బందరి కందఁ జేసినగురున్ ధ్యానింతు రామానుజున్ 8

యతికులపతి యానతిచే
క్షితితలముం బర్యటించి శ్రీహరి మహిమో
న్నతిఁ దెల్పినట్టి కూరే
శితృముఖ్యులఁ దలఁతు శేముషీ సింధువులన్. 9

అమలతర ప్రపదన యో
గ మహత్త్వముఁ జెప్పి స్వానుకార మ్మనుమా
త్రముఁ దగ దని సూచిన నిరు
పమగుణనిధి నెంతు సౌమ్యవర యోగీంద్రున్ 10

మేధావిపోషులకుఁ దా
మాధార మ్మగుచు వలయు వస్తుచయమ్మున్
సాధించి యిచ్చు విల స
ద్బోధమ్ములు కోశరాజములఁ ప్రబోధింతున్. 11

సాంప్రదాయములను జక్కఁగ బోధించి
నరులఁ దీర్చిదిద్ది హరి కటాక్ష
మునకు భాజనులుగ నొనరించు భాగవ
తాళి కెల్ల భక్తి నంజలింతు 12

ననుఁ గని పెంచి పెద్దగ నొనర్చి కవిత్వము రెండు బాసలన్
మనువరముం దదర్థముల మానుగఁ జెప్పిన సాంప్రదాయ బో
ధనపరు సంస్కృతాంధ్రకవితా విభవోజ్జ్వలు వాది భీకరా
భినవ వచో విలాసుఁ బరువెంకటదేశికుఁ బ్రస్తుతించెదన్ 13

జననం బందిన దాది నేటి వఱకున్ సంసార వారాశిలో
మునుకల్ వేయుచుఁ దేలుచొక్క నిమిషమ్మున్ బున్నెపుం బాటఁ బో
వని నా యొగ్గుదొలంగఁ బుట్టుపునసే ప్రపన్నాత్మతా పాటవ
మ్మునఁ బొల్పారిన శ్రీశఠారి చరితమ్మున్ వ్రాయఁగాఁ బూనితిన్ 14

విరచింపంబడె మున్ను నా జనకుచేఁ బ్రీతిఁ శఠారాతి స
చ్చరితంబచ్చ తెనుంగు బాసను నిర్దోష్యంబుఁ నిరూప్యంబునై
యరయంగా నది కేవలమ్ము బుధవేద్యం బౌట నే నిక్కృతిన్
సరళమ్మున్ సుఖబోధగమ్మగునటుల్ సంధింప యత్నించెదన్.

ఎందరు దీని మున్ను రచియింపఁగ లేదిటులన్ వృథాశ్రమం
బెందుల కందు రేని వినుడీ! మహనీయుల సత్కథామృతం
బెందరు ద్రావినం దఱుఁగునే? సురవృక్షలతాంతబృంద మా
రంద ఝరంబు లెన్ని భ్రమరంబులు గ్రోలిన నింకిపోవునే? 16

నక్కేడ నాకలోకం
బెక్కడ? నేనెడ? శఠరి దద్ధ చరిత్రం
బెక్కడ? నా యిక్కావ్యం
బెక్కరణిం బూర్ణమగునో? హృదయంగమమై. 17

శ్రీ శఠవైరి పాద సరసీరుహయుగ్మ మొకింత నాదు హృ
త్కోశమునన్ స్మరించి నవకోమలభావ పదార్థ చిత్రణా
కౌశల మిచ్చి నా తలఁపు కావ్యము పూర్ణ మొనర్ప నాతఁడే
యీశుఁడటంచు నా యెడఁద నెంచుచు గాథ కుపక్రమించెదన్.

# శ్రీ శఠకోప చరిత్రము

## —* నాంది *—

విరజా ద్వీపవతీ తటంబునఁ బ్రభాభివ్యక్త మాహాత్మ్య బం
ధురమై సూరిగణోపసేవ్యమయి నిర్ధూతాఘ సంపర్కమై
స్ఫురదానంద రసైకధామమయి చక్షుర్భాగధేయమ్మునై
వరలున్ దివ్యపురం బొకండు తిరమై వైకుంఠ నామమ్మునన్ 1

అప్రాకృతమై హాటక
వప్రావృతమై ధ్రువప్రభావాన్వితమై
యప్రమిత హరికటాక్షై
కప్రాప్యము నగుచు నన్నగర మలరారున్ 2

సరస గురూపదేశమున సంసృతి దుర్భరమౌచుఁ దోఁప శ్రీ
హరిపయి భారమొల్ల నిడి యాత్మవివేకమునంది దేహముం
దొరఁగి యజాండభాస్వదవధుల్ దరియించిన యట్టివారుగా
కొరుకులకుఁ దత్పురానఁ బదమూనఁగ శక్యమె ? యెంతవారి
కిన్ ! 3

తడయక తప్పుసేసి ప్రభుదండనకుం గురియై త్వరం జెఱం
బడి పలుపాట్లనంది నిజబంధులతో నెడబాసి క్రమ్మఱన్
విడుదలఁ జెంది గేహము ప్రవేశమొనర్చి మహాముదంబుఁ గాం
చెడు నరుభంగి ముక్తుఁడయి జీవుఁడటంబురణించు నిత్యుఁడై 4

ఆ పురమునకుఁ బ్రభువు నారాయణుండు
ఆ పురమ్మేల ? యీ యఖిలాండకోటి
కమలజాండములెల్ల నా ఘనుని కన్న
సన్నలం బుట్టుఁ గొంపందు సమయుఁ గాదె ? 5

ఒక్రేవ నిత్యులు ముకుళితహస్తులై
యెనలేని భక్తి సేవించుచుండ
నాకసంక సుక్తి బొద్దికఁ జేరి పారవ
శ్యమున నుద్గీథసామములు పాడఁ
జంటాదులున్ శంఖ చక్ర ముఖ్యాయుధ
కలితులై ద్వార రక్షణము సేయ
శ్రీ భూమి నీళాది సీమంతినులు చెంత
సర్వోపచారముల్ సల్పుచుండ

నిత్యనిరవద్యుఁడై సదా నిరతిశయ సు
ఖానుభవయుక్తుఁడైన నారాయణుండు
కొలువుదీర్చెను మాణిక్యకోటి ఘటిత
మహితమగు తిరుమామణి మంటపమున 6

అట్టి యానంద సాగరమందు మున్గి
యున్న యాతనిచూడ్కులు నుర్విఁబడెను
దారపురుషు లుత్తుంగ పదస్థులైన
నర్థయుతుండు రై ? పరవారి యంగదలను 7

కడుపునింపుటె తమ గమ్యంబుగా మది
భావించి పలుపాట్లు పడెడువారు
కాంతా ధనమ్ముల కాంక్షచే నొండొరుల్
గొనకొని కలహించుకొనెడు వారు
స్వర్గాది లఘుసుఖప్రాప్తి నాకాంక్షించి
తలక్రిందు తపములు సలుపువారు
పరలోక విస్మృతింబడి పాపకృత్యము
లూరక యొనరించు చుండువారు

స్వీయవర్ణ ధర్మములు వర్జించువారు
దృఢతరాహంకృతిన్ సంచరించువారు
విషయ విషగ్రోలు చుం దృప్తినడువారు
నోలిఁ గన్పట్టిరా హరి కొక్కరూఱు. 8

ఈ రీతిన్ ధారణిఁ బలు
తీరులఁ జరియించు నరుల తీరుంగని ని
ష్కారణ కరుణాభరణుఁడు
నారాయణుఁ డీగతిన్ మనమ్మునఁ దలఁచెన్. 9

అకటా! జీవు లహంకృతిం జెలఁగి దేహాత్మైక్య విభ్రాంతిచేఁ
బ్రకృతింజిక్కి జనుఃపరంపరలఁ బ్రాప్తంబైన కర్మంబుమీ
ఱక యజ్ఞానహతాత్ములై మదన నారాచమ్ములన్ ప్రుక్కి ర
క్షకునిన్ నన్ను విస్మరించి రిఁక నే చందాన నానందమో 10

ఇలపయి మానవుల్ నను భజించి తరించెద రంచు దేహమున్
బలమగు నింద్రియమ్ములను వారి కొసంగితిఁగాని సాధన
మ్ముల నవియే గ్రహించి సతముం జరియింతురు దుష్పథమ్ములన్
ఫలితము శూన్యమయ్యె నిటుపాపఫలం బెమురమ్యె నయ్యయో

భోగము నా కిటంబరగుఁ బూర్ణముగా భువియందు లీలయున్
సాగునటంచు నేఁదలచి స్వైరత నీయుకొసంగ మానవుల్
వేఁగుచునుండి రిట్లు పలువేదనలం బడి విస్మృతాత్ములై
జాగొనరింపరా దిఁకఁ బ్రజానివహోద్ధరణ ప్రవృత్తికై 12

అని చింతించి మనమ్మునన్ జలధి కన్యాజాని వాత్సల్యపున్
ఖనియై తానొనరింపఁబోవుపని యొక్కండయ్యుదానం బ్రయో
జనముల్ పెక్కులుగూర్పఁగాఁ దలఁచి విష్వక్సేనునిం జేరఁ బి
ల్వ నతం డంజలిసేసి కట్టెదుట నిల్వంగాంచి వాక్రుచ్చెడిన్

'పుడమివారలు నాయంతి పురముఁ జేరు
తెరవుఁ జూపెడి శాస్త్రపుం దెలివిదక్కి
మసలుచున్నారు వారికి నుంచిఁ గూర్ప
నీవె దిట్టరివయ్య! సేనేశ? వినుము 14

భూపతి యొక్కరుండు తన పుత్రవిహీనతకుం గలంగుచున్
నాపయి భక్తినిల్పి భజనం బొనరించునుగాన వానికిన్
బాపను పాపవౌచు ధర వర్తిలి యచ్చటివారి పాపముల్
తాపములుం దొలంగెడి విధమ్మున జ్ఞానపథమ్ముఁజూపుమా !

మును కుంభసంభవ మహా
ముని తన ద్రావిడము శాపముం బొందుటచే
నను బ్రార్థింపఁగ నాతని
కనుగ్రహించితిని భాషకర్తృత కలుగన్ 16

ఈ రెండు వరములున్ సమ
కూరఁగ ధరఁ బుట్టి నాదు గుణగణముల సొం
పారఁగ ద్రావిడభారతి
ధీరత వెలయించి ప్రస్తుతిం గనవోయీ! 17

అదియె వేదమహాచుఁ జదివెడివారికి
మోక్షదమ్మగుచుఁ బొలుపుమీఱు'
ననుచు నానతీయ నంబుజాక్షునకు సే
నేశుఁ డిట్లు విన్నవించెఁ బ్రీతి 18

'దేవరయోపకు దాసుఁ డి
దే వరలున్ బడ్డఁజొచ్చు నిదియంతయుఁ గా
దే ? వరకృప మాపై నో
దేవ ! రసాజనుల కింకఁ దీరును భవముల్' 19

అనుచు సేనాని తనదు నాజ్ఞానుపాల
నమున కీయకొనంగ నానందితాంత
రంగుఁడైన విహంగ తురంగముఁ డహీ
పుంగవుఁ గాంచి యనె నిత్తెఱంగుగాను 20

'ఈవు వినంగలేదె? యిదియెల్లఁ జమూపతి నాదు నాజ్ఞచే
నా వసుధాస్థలిన్ జననమందుట కేఁగఁగ నున్నవాఁడు నీ
వానఱకే ధరంబరగి యచ్చట శ్రీకురు కాపురమ్మునన్
వావిరిఁ జింతచెట్టగుచు వర్థిలు నా నిలయంబు ముంగడన్ 21

ఈ తీరు నీ వొనర్చిన
నా తరుకోటరమునన్ సుఖాసీనుండై
చేతం బరమపదం బిడు
కైతన్ వ్రాయంగలాఁడుగా యీదరయున్' 22

అని యాజ్ఞాపితుఁడై భుజంగమకులాధ్యక్షుండు శేషస్వభా
వనమద్భోగ సహస్రమండితమణివ్యాకీర్ణ నానారుచుల్
వనమాల్యంబుదమందు నింద్ర ధనురాభం గొల్పఁగాఁ
దత్పదా
బ్జనతిం జల్పి వినిర్గమించె విభునాజ్ఞం దీర్ప నుత్సాహియై.

బిరబిర బిరయనుచు నరగ
వర ముర్వర కలుగుదెంచి వరఁయిమ్మా
కురుకాపుర వరమున హరి
కపితం జిఱుచింతయగుచు నపుడుగఁ బరగెన్. 24

# శ్రీ శఠకోప చరిత్రము

## —* ప్రాదుర్భావము *—

సతతము సత్క్రియారతులైన జనులకుఁ
గాఁపుర మ్మాకురుకాపురమ్ము
ఇంద్రభోగముల నిర్జించు భోగములకు
దాఁపుర మ్మాకురుకాపురమ్ము
కనువిందు గూర్చు పొంకమునకుఁ గడపటి
తాపురమ్మా కురుకాపురమ్ము
ధనసమృద్ధమ్మౌచుఁ దనరుట యందల
కాపురమ్మా కురుకాపురమ్ము

కలిమి చెలిమియు నట నిల్లుకట్టుకొనియె
ననెడు యశము నల్గడలయం దల్లుకొనఁగ
నాల్గుకులములవార లానంద మందఁ
గా రహిల్లెను శ్రీ కురుకాపురమ్ము. 25

కారి సమాఖ్యనొప్పఁ గురుకాపురమేలెడి వల్లభుండు దు
ర్వార పరాక్రమ క్రమ విభంజితశాత్రవుఁ డర్థిలోక బృం
దారక భూరుహాంబు శతధారధర ప్రతిమానభోగ వి
స్ఫారుఁడు విష్ణుభృత్య పరిచారక కింకర కింకరుండునై 26

ప్రజలను గన్నబిడ్డలటు పాలనముం బొనరించుఁ బండిత
వ్రజమును సత్కరించుఁ బరభామలఁ దల్లివలెన్ గణించుఁ బే
ద జనుల నాదరించు గురుదర్శితరీతిఁ జరించు న్యాయమే
విజయపతాక నెత్తునటుః ఏఁక నతండువచించుఁ దీర్పులన్ 27

ఆ విజ్ఞాని యనంతభోగనిలయుండై శంఖచక్రాంకుఁడై
శ్రీవిభ్రాజితుఁడై యజస్ర విబుధశ్రేయోను సంధాయియై
దైవారెన్ ద్విజరాజభావుకతచే దాక్షిణ్యసంపత్తిచే
'నావిష్ణుః పృథివీశ్వరః' యనెడి వ్యాహారంబు తథ్యంబుగన్

నాథనాయిక యనియెడి నాతి మిన్న
కారి విభునకు నారి యాకాంత కాంతు
హృదయ మొప్ప డెఱింగి వర్తించు నంగ
నలకు నాదర్శమా సదమలచరిత్ర 29

వేకువజామునన్ నిదురవీడి మనోవిభు పాదయుగ్మముం
దాకి నమస్కరించి హరిధ్యానము సల్పి గృహక్రియావిధిన్
వ్యాకులపాటు లేక పతి యాజ్ఞల నొందలఁ దాల్చుచుండి భా
మాకులమంత కామె తలమానికమై యలరారె నిచ్చలున్ 30

దాసి సచివుండు రంభ మాతయును నౌచుఁ
బరిచరించెను గారి కాపడఁతి యెప్పుడు
కార్యకరణీయ శయనీయ ఖాదనముల
నెంతవారల కట్టి యదృష్టరేఖ? 31

అంతటి యదృష్టశాలి యయ్యవనిపతికి
సంతులేదయ్యె నయ్యయ్యొ! యీశ్వరున కిద్ది
పంతమందురో? కర్మపుం ఫలమొ? వాని
రంతు తెలియఁగంగ నెవరితరమ్ము! ధాత్రి. 32

సంతానం బాశ్రితజన
సంతానమ్మునకు నిట్టి జనపతి కయయో!
సంతానము లేదని ప్రజ
లెంతో చింతింపఁ గారిపృథ్వీశుండున్. 33

'కుడువఁగఁ గూడు కట్టుటకు గుడ్డ వెసం దలఁదాచుకొంటకున్
గుడిసెయులేని మానవులకుం గడు సంతతినిచ్చి కోటికిం
బడగవహించువాని కొకకాలకుచేని నిడంగఁ బోని యా
గడుసరి విశ్వకారణుని కార్యములెంతటి యద్భుతంబులో! 34

చిఱు నగవు వెన్నెలల్ గడు విరియఁజిమ్మ
చిలుకపలుకుల యమృతమ్ముఁ జిలికి యెడఁద
కలువ వికసింపఁజేయు జాబిలి యొకండు
తిరుగులాడని గృహమేల? సిరు లవేల? 35

కాళ్ళనిడినట్టి గజ్జెలు ఘల్లు మనఁగ
నట్టులిట్టులు పారాడి యంకసీమఁ
జేరి మారాముపెట్టు కుమారు ముద్దు
ముచ్చటలు దీర్చ భాగ్యముం బొందుటెపుడొ? 36

నందనులెందఱుంచు నను నల్వురిలోపల నెవ్వరేనిఁ బ్ర
చ్ఛందగఁ జేయ వారలకు సంతతిశూన్యుఁడనంచుఁదెల్పఁగా
డెందము డిందు సద్గతి గడింపఁగ నెద్దిపథమ్మొ? ప్రాగ్భవ
మ్మందొనరించినట్టి సుకృతార్జనముండెనొ? లేదొ? లేశమున్'

అని చింతంబడి కారిభూవిభుఁ డమాత్యశ్రేణితోఁ 'బుత్రులం
గన సత్కర్మము నెద్దియేనిఁ జలుపంగాఁ దెల్పుఁడీ'
యంచనన్

విని వారెల్లరుఁ గూడి రేనిమది గ్లానిందీర్చ నుత్కంఠ యో
చనముంజేసి వచించి రిట్లు తగుయోజన్ ముక్త కంఠమ్ముగన్

'ధరణీనాయక! నీవెఱుంగుదు సమస్తం బింతగా దీనికై
తెరు వన్యంబరయంగనేల! విను మర్థిస్తోమమందారమన్
బిరుదుం దాల్చిన యాదినాథుఁ డిటనే వేంచేసియుండంగ స
త్వర మాదేవు భజింప నవ్యమగు నాతం డిచ్చు సర్వార్థముల్

పసులం గోరినఁ గొన్నియె
వరముల నీయంగలట్టివారలు లక్ష్మీ
వరుఁడో సర్వాభీష్టము
లరుమర లే కొసఁగునట్టి డవనీ నాథా!' 40

అని సచివులు వచియింపఁగ
విని కారిన రేంద్రుఁ డంత వేడుక మెయి నిం
తినిఁ గూడి యాదినాథా
ఖ్య నిరవుకొను శౌరి యాలయమ్మున కేఁగెన్ 41

ఏఁగి హరిసన్నిధిని గాన్కలెల్ల నునిచె
నునిచి శిరమందు నంజలిఁ జొత్తి నొత్తి
మనము చిగురింప భక్తిసంభరితుఁ డగుచుఁ
గారి కంసారి నీరీతిగా నుతించె 42

'శ్రీ తరుణీమనోహర ! విరించిముఖామర వంద్యసార ! భా
వాతిగసృష్టిపుష్టి విలయాదివిలాస ! విశేషయోగ భో
గాతత తల్ప ! సంశ్రితజనావన పావననామ ! తామ్రప
ర్ణీతట నిత్యవాస ! నవనీరద మేచక ! యాదినాయకా ! 43

అణు వచలమ్ముగా నచల మా యణువట్లుగ ముజ్జగమ్ములం
దృఢముగ నాతృణమ్మునె విరించిపదమ్ముగ సల్పఁజాలు నో
ప్రణతజనార్తివారణ ? శుభంకర ! నీ కరుణా కటాక్ష వీ
క్షణముల నాపయిం బరపి సాకఁగ దే జగదేకవల్లభా ! 44

ఓ కంజాక్ష ? భవత్ప్రసాదమున నా కుక్షిన్ సమస్తార్థముల్
సేకూరెం గులభూరుహమ్ము తిరమై చెన్నొంద సంతానమే
యాకాశంపుఁ బ్రసూన మయ్యె నిఁక నీయవ్యాజకారుణ్యమే
నా కాధారమటంచు నమ్మితి ననంతా! యాదినాథప్రభూ!'
45

అని ప్రార్థింప దయాప్రఫుల్లహృదయుండై నాదినాథుండు చ
య్యన సాక్షాత్కృతుఁడై 'ప్రపన్నమతి నాయంశమ్ముచే
లోకపా
వనుఁడౌ పుత్త్రుఁడు నీకు గల్గు'నని తెల్పెన్ సంతసమ్మంది కా
రి నరేంద్రుండు నిజాలయమ్ము జని నారింగూడి యుత్సా
హియై 46

కాలక్రమమున గర్భముఁ
దాలిచి యానృపునికాంత శ్రద్ధయుఁ గాంతిన్
గ్రాలెను గారియు నెతఁబోఁ
ద్రోలెను బ్రభవిష్ణుఁడౌ సుతుఁ దలఁచుకొనుచున్ 47

పరమపదనాథు సంకల్పబలముచేత
నపుడు తచ్ఛమునాథు దివ్యాంశ మతివ
గర్భముం జొచ్చె బాలభాస్కరుని గనెడి
ప్రాగ్దిశాసతివోలె నప్పడఁతి యొప్పె 48

తొమ్మిదిమాసముల్ గడపి తొయ్యలి యొక్కశుభాహ
మందు ల
గ్నమ్ము ప్రశస్తమై తనరఁ గాంచెను బుత్రునిఁబూర్ణచంద్ర మ
స్మమ్మితమైన మోముగల చక్కనివాని పసిండిచాయలం
జిమ్మెడి మేనువానిఁ గలిజిత్వర సత్త్వ మహత్త్వ శోభితున్ 49

కారినరేంద్రుఁ డంత నధికమ్మగు సమ్మదమందుచున్ యథా
చారముగా సమస్తమగు జాతకకర్మములం బొనర్చి యా
శారితులైన విప్రుల కఖండముగాఁగ నొసంగి దక్షిణల్
మార నటంచు నామము కుమారునకుం గయిసేసె వాసిగన్ 50

# శ్రీ శఠకోప చరిత్రము

## —* తింత్రిణి *—

పుట్టినదాదిగ బాలుం
డెట్టి శిశుప్రకృతి నందకే దినదినమున్
దట్టపు మెఱుంగు లొలయఁగ
నిట్టలమగు నబ్బురమ్ము నించుచు నుండెన్ ! 51

కనులు దెరువఁగఁబోఁడు రోదనము సేయఁ
డుగ్గుఁ ద్రావఁడు స్తన్యంబ నొసఁగఁ గ్రోలఁ
డెప్పుడేని రవంత చలింపఁబోవఁ
డిట్టి విపరీతబాలుఁ డెందేనిఁ గలఁడె !

ఆహారమ్ము గ్రహింపఁబోఁడు మలమూత్రాదుల్ విసర్జింపఁబోఁ
డేహైన్యంబు శరీరమందుఁ గనఁబోఁ డెచ్చైన తేజమ్మునన్
బాహాటమ్ముగ వెల్గు దీనికి నిదానం బే తపశ్శక్తియో ?
యూహాతీతము లర్భకుం డిటులు మాయోద్యోగముల్
వీడుటల్ !! 53

పెల్లుగా నుబ్బివచ్చెడు తల్లిప్రేమ
రసపు మాధుర్యఝురులు వెక్కసముగాఁగ
భావ మెల్లెడ నైరాశ్య మావరింప
నాథనాయిక తలఁచె నిట్లాధి వొదల 54

'కడుపు ఫలింపలేదు బహుకాలము నేటికి శేషశేషి మా
యెడఁ గరుణించెఁ బుత్రుఁ డుదయించె నికన్ మురిపెమ్ము
ముచ్చటల్
తడయక తీరునంచు మదిఁ దద్దయు నాసలు పూనినార మీ
బుడుతని జూడ జూడఁ గడమొట్టుచునుండెఁ గలట్టి
కోరికల్ 55

ఈ విపరీత సంఘటన కెయ్యది హేతువొ ? తొంటిజన్మమం
దే వృజినమ్ము లెట్టివి యొనరించినవార మొ ? యీభవమ్మునం
దీవిధ మూర్తమై యనుభవింపఁగఁ జేయుచు నుండెనేమొ?యా
దైవము మాపయిం గరుణదక్క పరీక్ష యొనర్చు
చుండెనో ? 56

బొజ్జనిండుగఁ బాల్ద్రావి బోసినగవు
లొలుకఁ బోయుచుఁ గాలు సేతులను గదుపు
బిడ్డ నొడిలోన నిడికొని ప్రీతిఁగనెడి
భాగ్యమున్నదె ? నా కీభవమ్మునందు 57

బాలెంతనయ్యు నే గొ
డ్డాలు పగిది మందభాగ్య నైతిని శిశు తా
లీలా విహీనుఁడగు నీ
బాలుఁడు దీర్ఘాయువౌచు బ్రతుకం గలఁడా ? 58

ఎట్టి కీడును మదిని శంకింపరాదు
దేహమా ! నాటినాటికి సుదీర్ఘ కాంతిఁ
బుష్టమగుచుండెఁ గాని మాముద్దుఁ దీర్చు
ప్రాకృతవిలాసములు లేక భవ్యమగునె ? 59

అని యనిశంబుఁ గుందు తన యంగన యంగదపొంగుఁ
దీర్పఁగా
ననువగు యోచనంబు మది కందక యుగ్భిత శైశవప్రవ
ర్తనుఁ డగుచుం దనూభవుఁడు స్థాణువటుల్ మనుచుంటకుం
గత
మ్మును గనలేక కారియుఁ బ్రమోదముదక్కి తలంచె
నీ విధిన్ 60

'ఆదినాథుని దివ్యప్రసాదమహిమ
చేసి జనియించినట్టి యీ చిఱుత కిట్టి
దుర్విధంబేమి ? స్వామికి ద్రోహబుద్ధి
సేసినామొకో ? పున్నెముల్ వాసినాము ? 61

చిరము కులాంకురమ్ము కృపసేయక కారియ వెట్టెఁ గాఁ మా
వరుసగఁ బోవనీక యొకబాలు నొసంగి తృషాప్రసూనమున్
విరియఁగఁ జేసె దాని నిటు భిన్నమొనర్చుచునుండె దైవ మీ
శ్వర రచితేంద్రజాలవివశమ్ముగదా ? సకలప్రపంచమున్ 62

కలదెద్దో విధివైపరీత్య మటులం గాకున్న నీ బాలుఁ డి
ట్లలయింపం బనియేమి ? లోకమునఁ గద్దా ! యిట్టి.
దెందైన ? నీ
కలఁతం దీర్పఁగ నాదినాథునకె శక్యం'బంచుఁ దత్సన్నిధిన్
గల తీరెల్లెయు విన్నవించుకొనఁగాఁ గారిప్రభుం
డొక్కెడన్ 63

బంగరు టూయెలందుఁ బసిబాలునిఁ జక్కఁ బరుండఁబెట్టి వే
డ్కఁ గొనిరాఁగఁగింకరు లుకాంతయుఁదోజను దేరఁగా మనో
రంగమునందు భక్తి రుచిరంబుగఁ దాండవమాడ నాలయ
ప్రాంగణమందుఁ జేరి తన యార్తి నిటుల్ వెలిబుచ్చె
నమ్రుఁడై 64

'భవదవ్యాజకృపాకటాక్షములు మాపైఁ బారుటంజేసి యు
ద్భవముంగాంచిన బాలుఁడీతఁ డిటు చైతన్యమ్ము
గోల్పోయి శై
శవకృత్యమ్ములు లేకయున్న నెటుకాంక్షల్ దీరు? నస్మత్కృపా
భవనౌఘమ్ములు నిల్చునే? సుగతికిం బాత్రమ్ము
లేమౌదుమే! 65

బాలు నిడితికాని బాలునకుం దగు
లీలలేల మొసఁగలేదు? తండ్రి
యేది యెట్టులన్న నెల్లవేళల నిన్ను
నమ్మియుంటి మాదినాథ దేవ!' 66

అని కారి నికామము భ
క్తిని వేఁడఁగ నాదినాథదేవుఁడు గంభీ
రనినదమున నర్చకముఖ
మునఁ బల్కె సుధాసధామము లయిన పలుకుల్ 67

'కారినరేంద్ర! మీరలిటుగాసి వహింపఁగనేల? నాదువ్యా
హారము లాలకింపుఁడు మహామహుఁ డీ శిశు వుద్భవించుటన్
మీరు కృతార్థులైతి రిదినిక్కువ మిక్కిలిపూరుషార్థతిన్
బారఁగఁద్రోల నైహికభవమ్మును గాంచినవాఁ డితండుగా! 68

కలుషవిమోహ్యమా ప్రకృతిఁ గాంచఁడు మచ్చరణైకభావనా
బలమున నుజ్జ్వలుండగుచు వర్తిలు నిట్టి యమోహ సత్తునిం
దలఁపఁగరాదు వేఱుగ నితండు మదాలయమందె వర్ధిలం
గలఁడు చనుండు మీరలు సుఖమ్ముగ నాపయి
భారముంచుచున్' 69

అని పల్కియాదినాథుఁడు
తన కంఠమునందు విలసితమ్మగు విరిదం
డను బాలుని మెడ నిడఁగా
ననుజ్ఞనిడె నర్చకాళి కాక్షణమందే 70

హరియాజ్ఞం దలఁదాల్చి యర్చకులు వే యబ్బాలు
కంఠమ్మునన్
విరిదండం గయిసేయ నాతఁ డతిదీప్తిన్ డోలికన్ డిగ్గి చె
చ్చెరఁ బారాడుచు నాలయాగ్రధరణిం జెన్నొందు
చించాద్రుమం
బు రహింజేరి తదీయమైన వివరమ్ముం జొచ్చెన
ప్రబమ్ముగన్! 71

ఇదినిజమా ! భ్రమోదితమ ! యిన్నిదినమ్ములనుండి యీహలన్
వదలి జడమ్ముచాడ్పునఁ దనర్చిన యర్భకుఁడేమి! యిప్పు డొ
క్కఁడుటునఁ బ్రాకిపోయి కురుహోదరమందు వసించుటేమి!క
ట్టెదుటఁ బ్రవృత్తమయ్యెఁగథయెల్లదటిల్లసితోపమానమై 72
అనుచు నాశ్చర్యరసమగ్ను లగుచు హరి వి
లాసముల్ మనమునఁ దలపోసికొనుచుఁ
దత్పదాంభోజయుగళి న్యస్త భరులగుచు
మందిరమునకుఁ గారిదంపతులు జనిరి 73

—...—

# శ్రీ శఠకోప చరిత్రము

## —: ప్రభ :—

అంతన్ వైకుంఠనాథుం డనుమతినిడఁగా హర్షసంపూరితంబై
స్వాంతం బేపార సేనేశ్వరుఁడు ధరణిఁ జించాద్రుమమ్మందు శోభా
వంతుడై యున్న నాయర్భకున కొనరిచెం బంచ సంస్కారముల్ ని
ర్ధ్వాంతబా ధామముం జేరఁగ నరులకు మార్గంబు వేగన్ లభింపన్ 74

బాలవివస్వదంశువులు బ్రబ్బఁగ విచ్చెడి తమ్మిరేకులం
బోలుచు నంతకంతకుఁ బ్రఫుల్లములై యలరారుచుండె ల
క్ష్మీలలనామనోహరుని చిన్నెలఁ దాల్చిన నాటినుండి య
బ్బాలు నెడంద జ్ఞానముఁ బ్రపత్తియు మున్నగు సద్గుణౌఘముల్ 75

కారికుమారుఁడై భవముగాంచు కతమ్మునఁ గారిమారనన్
బేరున జన్మమాది శఠభీకరుఁడౌట శఠారిసంజ్ఞచేఁ
గూరిమి నాదినాథుఁడిడఁ గోమలవంజులదామభూషితుం
డై రహియిల్లుచుంట వకుళాభరణాఖ్య నతండు రాజిలెన్ 76

మఱియు శఠకోప శఠగోప మహితనామ
ములను జెన్నారె మఱియుఁ బెంపుఁగనెఁ బరుల
కంకుశప్రాయుఁడౌటఁ బరాంకుశాఖ్య
భక్తి పూర్ణత నమ్మాళువా రనంగ 77

అటు లోనెట్టిను గారిరాజసుతుఁ డీహాకోటిసీకృత్స్నము
ద్భటవృత్తిన్ భుజగేంద్రశాయి కలసద్గాథాసుధాపాన మొ
క్కటియే మేనునఁ బ్రాణముల్ నిలుప దిగ్భాగంబులన్నింటఁ బి
క్కటిలన్ స్వప్రభ కోటరంబునికిన్ మై క్రాలం బదా
రబ్దముల్ 78

# శ్రీ శఠకోప చరిత్రము

## —: మధురకవి :—

ఖ్యాతిగలయట్టి శ్రీకురుకాపురమ్ము
నికటమునఁ దిరుకోళూ రనియెడు పేర
నడరు నొక గ్రామ మాగ్రామమందుఁ బేర్మిఁ
దనరుచుండెడి నారాయణుఁ డను ద్విజుండు 79

ఆతఁడు పురశ్శిఖుఁడు ని
ష్ణాతుఁడు నిగమాగమముల సకలజనులకుం
బ్రీతికిఁ బాత్రము సుగుణ
వ్రాతముచేఁ బావనుండు వైష్ణవ భక్తిన్ 80

అల నప్వారునకున్ జనించెఁ గుముదాఖ్యాంశం గుమారుం
డొకం
డిలఁ గార్యాత్మజుఁ డుద్భవించుటకు మున్నే చండగోమాలికిన్
దొలుతం దోఁచు ననూరు చందమునఁ దత్పుణ్యవ్రతుం
డాగమా
ద్యలఘుజ్ఞాన నిధానుఁడై మధురకవ్యాఖ్యాకుఁడై వర్తిలెన్ 81

అతని కవిత్వమే మధురమందుమ! యాతని భాషణమ్ములున్
అతనివిదగ్ధతాగరిమ మాతని లోకహితప్రవర్తనం
బతని ప్రపన్నలక్షణము లాతనియాకృతి యేల ? విస్తరం
బతని సమస్తమున్ మధురమంచన నత్యుదితమ్ముగా దిలన్ 82

అటు లసద్వార్థసునాముఁడౌ మధురకవ్యాఖ్యుండు యాత్రార్థిఁబ
ర్యటనమ్ముం బొనరించు చొక్కెడ నయోధ్యం జేరి
యచ్చోట నె
ప్పటియు ట్లొక్క నిశీథినిన్ గృహబహిర్భాగంబు జేరంగ ను
త్కటమౌ తేజమొకండు దక్షిణదిశం గానంబడెన్ దవ్వుగన్

అది దావాగ్నియొ ? కా
కెదియో ? యనితలఁచి లోని కేఁగె నతం డా
పిదపన్ మఱు దినమున న
య్యది యటులే యర్ధరాత్రమం దగపడియెన్ 84

ప్రతిదిన మొక్కరీతిగ క్షపాసమయమ్మున వెల్గుకాంతికిం
గతము బలీయమెయ్యదియొ? కల్గు నవశ్యము తద్రహస్య మె
వ్వితముగనేని గోయక లభింపదు మానసశాంతి యంచు ను
ద్యతుఁడయి వెల్గుగానఁబడు నద్దెసకుం బయనించె
రాత్రులన్ 85

క్షితి నయస్కాంతశక్తి నాకృష్యమాఁ
మైన లోహమ్మురీతి నయ్యర్చి కభిము
ఖుఁడయి పయనించి పయనించి కడకు మధుర
కవిబుధుఁడు జేరె శ్రీకురుకాపురమ్ము 86

తొంటి రీతిగ నతఁడు ప్రొద్దునటఁ బుచ్చి
రెచ్చు కుతుకముతోడ నాశేయిఁ బురము
విడి పయనింప నెచ్చోట వెల్గుగనక
మఱలి కురుకకుఁ జేరి యీమాద్రిఁదలఁచె 87

కడుఘోరమ్ములనుండి పెక్కుదినముల్ గా వింతనైఁ గానవ
చ్చెడు నా తేజము గానరాదిపు డిటం జిత్తమ్మునం జిత్రమ
య్యెడు నాజ్యోతికి హేతు విస్ఫురమునం దే యుండఁగా నొప్పు ని
య్యెడనే తద్విధ మారయంగఁ దగు నాకింతేల ?
యోచింపగన్ 88

అని లోసం దలపోసి యస్ఫురమునం దాయాప్రదేశమ్ములన్
జనతోద్ఘాటితకారిరాజతనుభూచారిత్ర మాహాత్మ్యమున్
విని తేజమ్ము తదీయమంచు దృఢమౌవిశ్వాస మాత్మన్ గడ
లొక్కస నాధీనిధి సంతసిల్లెఁ గనకక్షోణీధరమ్మెక్కె నాన్ 86

అంత నావిజ్ఞుఁ డాదినాథాలయాగ్ర
భూమి నిరవొందు తింత్రిణీభూరుహమ్ము
డాసి కన్గొనె దాఁ గోటరమునందుఁ
గుదురుకొన్నట్టి యొక మౌని కులవరేణ్యు 90

బంగారు మేల్ మెఱుంగులు
పొంగారెడి మేనుతోడఁ బూర్ణతుషారాం
శుంగేరు మోముతోడ వె
లింగెడి విస్ఫారకాంతి రేఖావలితున్ 91

తనుదీప్తిం గలికల్మషాంధ తమసధ్వంసమ్ము జేయన్ విరో
చనుఁడై మీలిత లోచనుండయి లసచ్చక్రాదివైకుంఠలాం
ఛనుఁడై శ్రీధవదత్తమంజుళసుమస్రగ్భూషితగ్రీవుఁడై
కనదబ్జాసనసుస్థితిం జెలఁగు సుజ్ఞానైకవారాన్నిధిన్ 92

శిరమునఁ గేశవేశ మొకచెల్వము నీయ నిరంతరంబుఁ శ్రీ
హరిచరణాంబురుణ్మధులిహంబయి మానసముప్పసంతరాం
తరములనేని వాసనలఁ దావ్కొననీని స్థిరప్రవృత్తి స
త్త్వరసము సిందులొల్క సముదాత్తత వెల్గెడు శ్రీపరాంకుశున్

మధురకవి యంత నమ్మహామహితుఁ గాంచి
యా సునిశ్చలతకు వెఱఁగంది మిన్నుల
కనులు విప్పునో? విప్పఁడో? యనెడుశంక
వొడమఁ గరతాళశబ్దము నడరఁ జేసె 94

కారితనూజుఁ డాస్వనము కర్ణములంటఁగఁ గన్నుదోయి వి
ప్పారఁగఁజేసి యాక్షణమునందె మొగుడ్చుటచేసి యాత్మలో
వారక యొక్కసంశయనివారణ మయ్యెను, భాషణక్రమం
బారయఁ గాఁ దలంచి మధురాఖ్యకవీంద్రుఁ డొనర్చెఁ
బ్రశ్నమున్ 95

'ప్రకృతి కడుపున సూక్ష్మజీవమ్ము బుట్టి
యేమి దినును? దా నెచ్చోట నెసఁగు?' ననిన
'దానిఁ దిని దానియందు తాఁ దనరు' ననుచు
రమ్యశఠవైరి ప్రత్యుత్తర మ్మొసంగె 96

తనదా ప్రశ్నకు నుత్తరమ్ము నిగమాంతజ్ఞానపారీణతం
గనువారే యెడ సర్వజ్ఞు లీతఁ డటు యుక్తంబైన ప్రత్యుత్తర
మ్మున నాహృత్సరసీజమున్ వికసితమ్ముం జేసె, విజ్ఞాత మ
య్యె నసాధారణ తత్త్వవేది యితఁడౌ, నేపుట్ట నేసర్పమో!

అతని దలఁచి మధురకవి యె
మ్మనమున ముదముం బ్రపత్తి మల్లడి గొనఁగన్
బ్రణమిల్లి శ్రీపరాంకుశ
మునికిన్ విన్నపము సేయ మొదలిడె నిటులన్ 98

'ఓ యతిలోకపావన మహోజ్జ్వలచారుచరిత్ర! నేటి కా
ప్యాయన మయ్యె నాజనన మందెఁ గృతార్థత నీదుదివ్య తే
జోయుతమూర్తిఁ గన్గొని విశుద్ధసుధామయసూక్తి వింటి నిన్
బాయను నన్నుఁ జేకొని కృపామతిఁ దీర్పవె సంవిదంబుధీ! 99

భవదవమందు గ్రమ్మి యెటుపాఱుటకున్ గతిఁగానక క్లిష్టపా
టవ మఱియున్న మాదృశజనప్రకరమ్ము ననుగ్రహింపఁగా
నవతరణమ్ముఁ గాంచిన మహామహా! నీపదపంకజద్వయం
బవుడలఁ దాల్తు నాదెసఁ గృపామృతవర్షణముం
బొనర్పుమా! 100

నెట్టన నీదుపదమ్ములు
బట్టితి నాచార్య! యింకపై నిద్ధరణిన్
బుట్టుట గిట్టుట వాపెడి
గుట్టుఁ దెలిపి నన్ను నేలుకొనఁగదె! కరుణన్' 101

అనుచు మనసారఁ బ్రార్థించి యంఘ్రియుగళిఁ
బట్టి యిరువని గాఢప్రపత్తి భరితుఁ
డైన మధురకవిం దనవానిఁ జేసి
కొనియె సుజ్ఞాని శ్రీ శఠకోపమౌని 102

సహజభక్తిరసార్ద్రమై సారవంత
మైన తన్మానసక్షేత్రమందు బోధ
నా హలమ్మున దున్ని జ్ఞానంపు బీజ
ములను శ్రీపరాంకుశ కృషీవలుఁడు నాటె 103

'భాసిల్లు మూడు తత్త్వములు చిత్తు నచిత్తు
నీశ్వరుఁడన్ పేర నెసఁగి యందుఁ
జిత్తనఁ జీవుం డచిత్తన జడము లీ
యఖిలమ్ములకుఁ దా నియంత యీశ్వ
రుఁ డతఁ డాఢ్యుఁడు స్వతంత్రుఁడు జీవకోటికిఁ
బారతంత్ర్యమ్మె రూపమ్ము, ముక్తి
మార్గములయిన కర్మజ్ఞాన భక్తి ప్రప
త్తులలోనఁ బ్రపత్తి శ్రేష్ఠ
మీశ్వరునియందుఁ దనభర మెల్ల నునుచు
టే యగుఁ బ్రపత్తి, యద్ది లభించు గురుస
మాశ్రయమ్మున, నద్దాన నవనిజనులు
పరమపదభోగ మందు టవశ్య'మనుచు. 104

నాటినబీజముల్ మనమునన్ నెలవొందుచు నంకురమ్ములై
వాటముగన్ జిగిర్చి విటపమ్ములనెత్తి సుమించిమించె నే
నాటికి నీటువోవని సనాతనసత్ఫలసిద్ధి కల్గ నే
లోటు ? మహాత్మసమాశ్రయములోని విశిష్టత యిద్దియే కదా!

—•••—

# శ్రీ శఠకోప చరిత్రము

## —: ఆగమావతరణము :—

భ్రమరముతో భ్రమించి తదవస్థను బొందిన కీటమట్లు స్వో
పమితి రహిల్లు ఛాత్రు వరివస్యల నందుచుఁ జంద్రికాసమా
గమమునకై చకోరకము కైవడి శ్రీహరి దివ్యదర్శనా
ర్థము శఠకోపసంయమి కరమ్ము విరాళి వహింప నొక్కెడన్.

మరకత సప్రభమ్మయిన మంగళవిగ్రహమందు హాటకాం
బరము కరమ్ము వెల్గఁ గరవారిరుహమ్ముల శంఖచక్రముల్
పరిభవమందఁగా నిరుగెలంకుల రాణులుఁ గొల్వఁ బక్షిరా
ట్తురగుఁడు దివ్యవైభవముతోడఁ గనంబడె శ్రీశఠారికిన్.

ఆహా! నాహృదయాధినాథుఁ డిటులన్ సాక్షాత్కృతుం డయ్యె నే
డోహో యేమిమనోజ్ఞతాగరిమమోహో! యేమిగాంభీర్యమో
హో హో! యేమి ప్రసన్నవీక్షణము లోహో యేమి సందీప్తి యో
హోహో! యేమిపరత్వసత్త్వతరుణత్వోన్మేష సౌలభ్యముల్. 108

ఎన్నటి కబ్బె నీమధురదృశ్యము గాంచెడి భాగధేయ మీ
కన్నులకప్పురంబు మధుకైటభమర్దనుఁ డిన్నినాళ్ళుగా
నన్నలయించి యిత్తఱి మనమ్మును నిల్వఁగదోఁచె నిట్టి బల్
వన్నియ కాని నాహృదయపంజరబద్ధు నొనర్తు నిప్పుడే. 109

అనుచు నానంద పారవశ్యమున నొడలు
కంపమందఁగ బాష్పపూరంబు గనులూర
హరి విరహమును సైరింప నలవిగాక
వకుళభూషణుఁ డిటు రమావరుని వేఁడె. 110

'నను వంచించి చనంగఁబోకు మిఁక నానాయాతనాధీన మి
త్తనువుం జాల్పఁగఁజాల నొక్క క్షణమాత్రమ్మేని దివ్యదయా
వనధీ! నన్ దరిఁజేర్చుకొమ్మచట సేవామాధురిన్ నీదుచెం
త నిమేషమ్ములరీతిఁ ద్రుళ్ళెద ననంతబ్రహ్మకల్పాంతముల్.

అనుచు శఠారి యాత్రమునఁ బ్రార్థనముం బొనరింప శ్రీశుఁడో
గుణనిధి! నీదుపుట్టువునకుం గలకారణ మీవెఱుంగవో?
వినుము నరుల్ ననుంగనఁ బవిత్రతమంబగు గ్రంథజాల ము
ర్వని వెలయింపు మాపయి వరించును నిన్నపవర్గలక్ష్మియున్.' 112

అని కారిప్రభుసూతి కానతిడి తా నంతర్హితుండయ్యె; నా
తనిమూర్తిన్ శఠవైరి చిత్తమున హత్తంజేయుచున్ ద్రావిడ
మ్మున నాల్గింటిఁ దగన్ రచించె నిగమాంభోరాశినిం ద్రచ్చి మె
త్తిన పీయూషపుధారలో! యను మహాదివ్యప్రబంధమ్ములన్. 113

మును హృదయాంతరాళమునఁ బుట్టి ప్రవృద్ధములై నదివ్యభా
వనములు స్వామిపర్యనుభవహర్షసంతతపుం భరమ్ముచే
ననయముఁ బిక్కటిల్లి రసనాగ్రము వెల్వడి యక్షరమ్ములై
యనుపమ శబ్దపుంజములునై యలరెన్ ద్రవిడాగమప్రథన్.

స్థిరుఁడై శ్రీశఠకోపమౌని రచనాదీక్షం బ్రవర్తింప ను
ర్వరఁ జెన్నారెడి దివ్యదేశముల సర్చారూపుఁడై వెల్గుశ్రీ
హరి మూర్తుల్ నిజవైభవమ్మడరఁ బ్రత్యక్షమ్ములై తోఁచఁగాఁ
బరితుష్టిం దదఖండ దివ్యమహిమల్ పాడెం బ్రబంధమ్ములన్. 115

యత్నమొక్కింత లేక యాస్యమ్మునుండి
జాలువారిన వకుళభూషణుని మధుర
వాణి చెన్నారె నక్షరత్వమున మధుర
కవి బుధేంద్రుఁడు దాను లేఖకుఁడుగాఁగ. 116

తిరువాయిమొళి యనంగన్
దిరువాశిరియ మ్మనంగఁ దిరువృత్తమ్మన్
దిరువందాది యనంగం
బరగిన గ్రంథములఁ దొలి ప్రబంధమునందున్ 117

పరజీవుల రూపమ్మం
బరు నాజీవుండు గను నుపాయము దానం
గరగతమగు ఫలముం ద
ద్విరోధిరూపమ్ము నోలిఁ దెల్పఁగఁ బడియెన్ 118

వేదసార మగుచు విలసిల్లు ద్వయమంత్ర
మునకు సద్ది భాష్యమనఁగ నుండి
పాశములనుఁ ద్రెంచివైచి బద్ధుల ముక్త
పదముఁ జేర్చు ప్రాభవమునఁ దనరు 119

అట్టి సుమహత్త్వసంపదాఢ్యమ్ములగు ప్ర
బంధములఁ నోలి బోధించెఁ బ్రణిపతినప
రుఁడుఁ బ్రశ్నకాలప్రతీక్షుండు నైన
మధురకవికిఁ బరాంకుశమానివరుఁడు. 120

జ్ఞానపయోధియైన శఠశాసను పాదసరోజసేవయున్
దాన లభించినట్టి ధిషణాగరిమమ్మును, దివ్యవాఙ్మరం
దానుభవమ్ము నొక్కటయి హర్షరసాప్లుతుఁ జేయ దేశిక
ధ్యానము గాఁగ నిట్లు మధురాఖ్య కవీంద్రుఁడు పాడెఁ
దియ్యగన్ 121

# శ్రీ శఠకోప చరిత్రము

## —: కణ్ణినుణ్ శిరుత్తాంబు :—

వాంఛఁ జిఱుత్రాటిచేఁ గట్టువడిన పెద్ద
మాయకాఁడగు నాప్రభు మాటకన్నఁ
గురుక కధ్యక్షుఁడగు శఠకోపు స్మరణ
నొల్కు నమృతంబు రుచియించు నాల్కకెపుడు 122

నాల్కనిండారఁ బాడి యానంద మంది
తిని దదంఘ్ర్యబ్జములు బట్టితిని దదన్య
దేవు నెఱుఁగను శఠకోపదివ్యగీత
సరసగానమ్ము సేయుచు దిరుగుచుందు 123

తిరిగి దేవాధిదేవు సుందరవినీల
శోభ మీఱెడు నెమ్మేనుఁ జూడఁ గంటి
నహహా ! సముదారుఁడౌ కురుకాధినాథు
దాస్యమున భాగ్య మిద్ది లబ్ధమ్ము నాకు 124

నాదునైచ్యముఁ జిత్తమునం దలంచి
తల్లియై తండ్రియై కొఱంతలను బాపి
ప్రోచు గుణపూర్ణుఁ డామ్నాయములకుఁ జిక్కు
లెల్లఁ దీసిన శఠవైరియే ప్రభుండు 125

ప్రభుని సాత్త్వికు నాత్మ నా వశమటంచు
నమ్మి మున్నంతయుఁ బరాంగనలను గోరి
యుంటి బంగరుమేడల నొప్పు కురుక
యధిపు సేవ సమర్థుఁడ నైతి నింక 126

ఇంక నెక్కాలమును స్థిరవృత్తిఁ దనదు
భవ్యగుణములు వొగడెడి భాగ్యమిడెను
బర్వతోత్తుంగ సౌధాళి బరగు కురుక
పతి యిఁకెన్నఁడు నన్ విడువండు కనుఁడు 127

కనిననుం గారితనయుండు కరుణ నాపు
రాజ్ఞితోరుతరాఘము లణఁచినాఁడు
చాలెదనుగాక యెల్లదిశలను దెలియ
ద్రవిడ కవినేత శ్రీ శఠారాతి కరుణ 128

కరుణఁ గొనియాడు దాసనికరము కరము
హర్ష మందఁగ వేదరహస్యములను
ద్రావిడమ్మున వేయిగీతములఁ దెల్పె
నతని కృప యిజ్జగమున నాఢ్యమ్ము చాల 129

చాల మోక్షార్థులకు వేదసారములను
బాడి నామనమున స్థిరపరచినాఁడు
గుణగరిష్ఠుఁడు శఠకోపగురునిఁ బ్రేమ
నాశ్రయించినదాని కియ్యది ఫలమ్ము 130

ఫలము లేకున్న, విముఖులౌ వారినైన
చర్యలను దిద్ది సుముఖులఁ జల్పు పికర
వాంచితారామయుత కురుకాధినాథ!
నీ పదమ్ముల కర్థింతు నేను ప్రీతి 131

ప్రీతి హరిఁ గొల్చుచుండువారి పయి నెంతొ
వత్సలుండగు కురుకాధిపతికి దాసుఁ
డై మధురకవి సెప్పిన యర్థములను
నమ్మువారికి పరమపదమ్ము పదము 132

—— • • • ——

# శ్రీ శఠకోప చరిత్రము

## —: ఐక్యము :—

అని యాచార్యప్రపదన
ఘనత నిటుల్ దెలిపి మధురకవి శఠకోపాం
ఘ్రినివిష్టసర్వభరుఁడై
దినములు బోనెట్టుచుండె ధీరత వెలయన్ 133

అంతటఁ గొన్నినా ళ్ళిటు లిహమ్మున నప్రతిమప్రభావుఁడై
సంతతచింతితాజపదసారసుఁడై లసమానుఁడై యనా
ద్యంతము నప్రమేయ సుసుఖాస్పదమౌ పరవాసుదేవహ
ర్మ్యాంతరమందు నిత్యనివహమ్మునఁ జేరి పరాంకు
శుండు దాన్. 134

చిరవిరహమ్ముచేఁ బొగిలి చిత్తమునం దలలెత్తు భావనాం
కురములె యూతయౌచు బ్రతుకున్ నిలుపం దుదకెట్లో జీవితే
శ్వరు నుపగూహనమ్మున నపారసుఖాంబుధి నోలలాడు బి
త్తరి వలెనై యొడల్ మఱచెఁ దామరసాక్షు శుభాంకవర్తియై.

రవిలేని దివసమై కై
రవకులబాంధవుఁడు లేని రాత్రియునై కాం
తివిహీనమయ్యెఁ గురుకయు
ద్రవిడాగమదర్శి హరిపదమ్మును జేరన్. 136

గురువియోగార్తి మివ్వల దుర్భరము గాఁగఁ
దత్కృపాలబ్ధభూరిబోధప్రభావ
మున మనమ్మున నూఱటవొంది మధుర
కవి దినమ్ముల నెట్టులో కడపుచుండె. 137

ఆచార్యదివ్యమాహాత్మ్యము జాటుచుఁ
దత్సూక్తులందు నాదరము వెంచి
నిత్యానుసంధాన నియతుఁడై తనరుచుఁ
గురుకాపురమ్మునఁ గొమరుమీఱు
నాదినాథస్వామి యాలయమునకు ముం
దట నున్న తింత్రిణీతరువు నికట
మందొక రమ్యాలయమ్ము నిర్మింపఁగా
నొనరించి వైభవాభ్యుదయమొప్ప

నందు నుజ్జ్వలమైన శఠారివిగ్ర
హము ప్రతిష్ఠించి నిత్యార్చనాదివిధులు
గ్రమముఁ దప్పక నెఱవేర్పఁగాఁ బరిజను
లను నియోగించె విబుధు లాహ్లాదమంద. 143

---

# శ్రీ శఠకోప చరిత్రము

## —: కవితా ప్రభావము :—

అమితప్రజ్ఞుఁడు కుంభసంభవుఁడు పాండ్యక్ష్మాభృదాస్థానమం
దమరంజేసెను మున్ను శంఖఫలకం బన్ పీఠ మొక్కండు త
త్కృత్రిమ మాశ్చర్యవిధాయకంబు కవితాసత్త్వంబునన్ నిర్ణయిం
చు మహాశక్తి నిమిడ్చి నందున మునీశుం డూర్జితప్రక్రియన్.

అసదృక్శిల్పమహత్త్వసంభరితశాలావ్యారంభుఁ డప్పీఠిపై
మసలంజాలఁ బరుండు దానిపయి నేమాత్రమ్ము కాలూనినన్
బ్రసభప్రక్రియఁ ద్రోచివైచు నది తన్మార్గమ్మునన్ నెగ్గి రా
జసభన్ గౌరవ మందియుండెఁ గవిరాజన్యుం డొకం డుద్ధతిన్.

ఆతఁడు కంబనాథుఁడను నాఖ్యఁ జెలంగి దిగంతవిశ్రుత
స్ఫీతయశస్కుఁడై బహుళశిష్యసమూహసమావృతుండునై
భూతలమెల్లఁ బర్యటనముం బొనరించు తలంపుతోడ బల్
కౌతుక ముప్పతిల్లఁ గురుకాపురికిం జనుదేర నచ్చటన్. 141

'జయ వకుళదామభూషిత!
జయజయ జ్ఞానస్వరూప! జయ మానివరా!
జయ సేనేశాంశోద్భవ!
జయ విచ్ఛిన్నభవపాశ జయ కురుకేశా! 142

భువనోద్ధారణకారణోద్భవ! శఠప్రోద్యన్మదగ్రావవా
సవ! యజ్ఞానతమోదినేశ! హరిత్పృష్ఠాకృప! కార్యాత్మజా!
ద్రవిడామ్నాయసుధాపయోధితుహినోస్రా! తింత్రిణీ
సంశ్రితా!
కవిపంచాస్య! ప్రపన్నలోకమణి! యూకారత్రయీ శోభితా!'

అనుచుఁ బరిచారకులు సపర్యాసమయము
నందు శఠమర్షణుని మహిమావళులను
గడఁగి యుద్ఘోష సేయుచుఁ గాహళికల
నూదసాగిరి పలుమాఱు లుద్భటముగ. 144

కంబకవీంద్రుని శిష్యుల
కంబకముల పఱది నాజయస్వనములు క
ర్ణంబుల నాటఁగ వారు ర.
యంబునఁ బరతెంచి యర్చకాళిం గనుచున్ 145

'అవనిన్ మాగురుఁ డూర్జితోర్జితకవిత్వాటోపుఁడై
యుండ మీ
కవిపంచాస్యుఁడొకండొ? యీబిరుద మంకమ్మయ్యె
మాయొజ్జ క
ర్షావిధిం, జూతుము మీపటుత్వ'మని పేరాలాపముల్
పల్కుచున్
జవమొప్పం గొనిపోయి రొజ్జకడ కీర్ష్యాగ్రస్తులై కాహళల్.

అంత నయ్యుదంత మంతయు నారసి
మధురకవి ప్రదీప్తమానుఁ డగుచుఁ
గంబనాథుని నికటంబునకుం జని
స్నిగ్ధభావమున వచించె నిట్లు 147

'ఏల ? దురాగ్రహమ్మిటు బుధేంద్రులు మీకొకరుండు చెప్పఁగాఁ
బోలునె? మాగురుప్రవరుఁ బోని కవీంద్రుఁడు ముజ్జగమ్ములన్
గ్రాలఁడు పంతమున్ విడచి కాహళ లిచ్చిన మీకు మాకునున్
మేలగు' నంచుఁ బల్కిన గణింపక కంబకవీంద్రుఁ డిట్లనున్.

'వాడివాడి మాటలేమిటికిఁ బోడిమి గల్గినఁ బాండ్యరాట్సభం
గడిమివహించు శంఖఫలకమ్మున మీగురువర్యు కబ్బమున్
పడి నిహితమ్ము సేసి సముపార్జితమౌ బిరుదమ్ము సార్థకం
పడ నొనరించినప్డె కొనవచ్చును మీ జయచిహ్న కాహళల్'

అని సంతుష్టమనస్కుఁడై మధురకవ్యార్యుండు శ్రీకారివం
దను శ్రీసూక్తిలవమ్ము మాత్ర మొకపత్రమ్మందు వే వ్రాసియి
చ్చిన దానిం గొనిపోయి కంబకవి వ్రాసిన్ శంఖపీఠమ్ముం
దునుపం బత్రము వెల్గెఁ గంబకవిగర్వోద్రేకదాత్రమ్మై.

పూర్వ మధిష్ఠితమ్మయి ప్రమోదము గూర్చిన శంఖపేర నే
యుర్వికిఁ ద్రోచివైచె నిపుడుద్ధతుఁ గంబకపేద్రుఁడు,
నాతఁడుస్
గర్వము డింది కారిసుతు కబ్బమునన్ విలసిల్లు సారమున్
సర్వమెఱింగిభక్తి శఠశాసనుఁ జిత్తమునం దలంచుచుక్ 151

## —: ఉత్పలమాలిక :—

'ఆతతపక్షచాలనరయంబున నీ౯దుమహీజాండభాండ సం
ఘాతము లొంటిమై దులుపఁగల్గిన తార్క్ష్యుని పొంతదోసుకుం
బ్రాఁతి ఘటిల్లునే? నిజగభస్తిసహస్రముచే దిగంతముల్
ద్యోతితముల్ వొనర్చు రవితో నెపుడైనను సాటియౌనె? ఖ
ద్యోతము కేవలమ్ముస్మృతితోడన గుండియలం బగుల్చుచున్
ఘాత మొనర్చు బెబ్బులికిఁ గట్టెదుటన్ శునకమ్మువొందదే?
భీతి మదేభకుంభము విభిన్నము జేసి తదీయమాంసముం
బోతర మొప్పఁగా మెసవఁబోవు మృగేంద్రము చెంత
జంబుకం
బేతఱినైన స్వేచ్ఛఁజరియించునె? యింపులుగుల్కు నప్సరో
జాతము ముందువెల్గునె? పిశాచగణంబు, భవత్ప్రభావ మూ
హాతిగ మయ్య! మాకు భవదగ్రమునన్ నిలువక్ వశమ్మె? ని
ర్ధూతము మాదు నాంధ్య మనిరోధముతో భవదీయకీర్తి చం

ద్రావితపకాంతు లెల్లెడల నజ్ఞతచే నొనరించినట్టి మా
చేతల నెన్నఁబోక కృపచే క్షమియింపఁగదయ్య! భద్రసం
ధాతవు ద్రావిడాగమవిధాతవుగా కవిసింహ మన్న వి
ఖ్యాతి వహింప నీక కడు నర్హమగుంగద? శ్రీపరాంకుశా! 152

అని ప్రస్తుతించి శఠకో
పప్రసక్తి జయవిజయశబ్దములు వల్కుచు మ్రో
గొనినట్టి కాహళిక లిడఁ
బనిచెను గంబకవి స్వీయపరిచారకులన్ 153

మధురకవి యట్లు శఠకోపమౌని మహిమ
లెల్లెడల విదిత మ్మొనరించి తత్ప్ర
ధోక్తులను దెల్పి ముక్తిమార్గోన్ముఖులుగ
దిద్దె నరులను గురుపరాధీనబుద్ధి. 154



# శ్రీ శఠకోప చరిత్రము

## —: భరతవాక్యము :—

ఆమార్గంబు పరంపరానుగతమై యార్యోపజుష్టంబునై
శ్రీమన్నాథవరమ్యహర్మ్యవసతిం జేకూర్చి తన్నిత్యసే
వామాధుర్యము మానవాళి కిడు దివ్యప్రాభవోపేతమై
యామోదావహమై రమావిభున, కొప్పారెం జిరస్థాయియై.

నమ్మాళ్వారుల దివ్యవాణి యెటొ లీనంబయ్యెఁ గాలంపుగ
ర్భమ్మం దాపయి నాథమౌని కెటొ పత్రం బొందు
ప్రాప్తింపఁ బూ
ర్ణమ్మౌ గ్రంథముఁగోరి యాతఁ డెద ధ్యానమ్ముం
బౌనర్వంగ స
ర్వమ్ముం దాఁ గృపసేసెఁ గారిసుతుఁడే ప్రత్యక్షమై
ప్రీతిచేన్. 156

ఆవిధి నాథమౌని, ఖిలమైన శఠారి సరస్వతిం బున
ర్జీవితఁ జేసి నిల్పె జడచేతను లద్ది పఠించి ముక్తికాం
తావృతు లౌచునుండి రిఁక ధారణి వైష్ణవ దివ్యదేశముల్
పావనముల్ తదధ్యయనభాగ్యము సేకురియుంట
నేటికిన్. 157

స్వస్తి సమస్తభక్తపరిషచ్ఛుభదాయికి శేషశాయికిన్
స్వస్తి విరాట్పురంధ్రులకు సైన్యపతిప్రముఖామరాళికిన్
స్వస్తి శఠారిసంయమికి స్వస్తిపురాతనదేశికాళికిన్
స్వస్తి ప్రబంధమండలికి సద్గురుమాళికి లోకపాళికిన్. 158

స్థిర నల్లాన్ గురుచక్రవర్తికులభూతి ర్వేంకటార్యాత్మజుం
డ రసోదంచితగానవాదనచణుండన్ గృష్ణమాచార్యుఁడన్
సరవిన్ మత్పితృపాదలబ్ధకవితాశాలిన్, శఠారాతిస
చ్చరితంబున్ రచియించినాఁడ దోసఁగుల్ సైరింపుఁడీ
పండితుల్ ! 159

సమాప్తము



తి॥ న॥ చ॥ సం॥ జ॥ తిరువేంకటాచార్యులవారు

# కవిపరిచయం

జన్మస్థానము జగ్గయ్యపేట. జననము 1899. ప్రస్తుతః విజయవాడ స్థిరనివాసము. ఆచార్య పురుషులు. సంస్కృతాంధ్ర ద్రావిడ భాషలందు కూలంకష ప్రజ్ఞావంతులు. శతాధిక గ్రంథకర్తలు.

వీరు సంస్కృతాంధ్రములందు అసమానముగ కవిత చెప్పగలవారు. వీరు జగన్నాథదేశిక రాజసూక్తి యను పేరుగల సుమారు ఆరువేల సీసపద్యముల శ్రీవైష్ణవమతసిద్ధాంత ప్రతిపాదక గ్రంథరాజము రచించిరి. తిరుప్పావునకు రుచిరార్థబోధిని యను సంస్కృతవ్యాఖ్యను సరసమగు శైలిలో సహృదయ రంజకముగ రచించిరి.

వీరి మరికొన్ని ముఖ్యగ్రంథములు:

1. అష్టాదశ రహస్యములకు శ్లోకరూపానసారము.
2. అభినవకూరేశ విజయము. ఆంధ్రపద్యకావ్యము.
3. భాకత, రామాయణ హరికథలు.

వీరి గ్రంథము లింతవరకు ముద్రణభాగ్య మందకపోవుట ఆంధ్రుల దురదృష్ట మనక తప్పదు.

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణేనమః

# శ్రీపరాంకుశ శతకము

శ్రీశఠకోప! కారిసుత! సింధుసుతాపతి మానసప్రియా!
దేశిక పట్టభద్ర! వితథీకృత దుర్మతపక్ష! శౌరి శే
షాశనపాదచింతన! యఘౌఘనికృంతన! మీపదాంబుజా
భ్యాశము జేరినాడ ననుఁ బాలనఁజేయుఁడు శ్రీపరాంకుశా!1

ద్రావిడవేద మంతయును ధారుణిలోన ముముక్షుమానవుల్
భావమునందు భక్తి దయివారఁగ నధ్యయనంబు సేసి ల
క్ష్మీవిభు సన్నిధానమును జెంది సుఖంబునుగాంచుటారయన్
మీవలనన్ గదా! యపరి మేయయశోనిధి! శ్రీపరాంకుశా!2

అనఘుఁడగ స్వమానినుఁ డంబవివాహము వేళఁ ద్రష్టచే
తను బరిభూతుఁడై తనదు ద్రావిడభాష బహుప్రకృష్టతన్
గనుటకునై యొనర్చిన యఖండతపంబునకున్ ఫలంబుగా
జననము నొందినారు విలసద్గుణ! మీరలు శ్రీపరాంకుశా! 3

మనుజ శరీర మూనియును మానవచేష్టిత మేమిలేకయే
దినముఁ బ్రవర్ధమానమగు దేహముతోడ జెలంగు మీకథన్!
విని యవతారమూర్తుల పవిత్ర చరిత్రముకన్న మిన్నయే
యనుకొనుచున్నవారము మహావిభవోన్నత!
శ్రీపరాంకుశా ! 4

శ్రీకరుఁ డా కురంగనగరీపతి కారివిభుండు పుత్త్రుకై
ప్రాకటభక్తి వేఁడఁ దన వంటి కుమారుని నిత్తునంచుఁ దా
నేకడ నట్టివానిఁ గన కేవునఁ దానె జనించెనంట మీ
యాకృతిఁ బూని మాదృగవనార్థముగా ధరణిన్
బరాంకుశా! 5

ద్రావిడవేదమెల్ల నుదరంబునఁ దాల్చిన మిమ్ము గర్భమం
దే వనితామతల్లి ధరియించెనొ యాయమ భాగ్య మెట్టిదో
దేవనియంతృమాత వసుదేవునిపత్నియుఁ గోసలాఖ్య ధా
త్రీవరపుత్త్రి యాయమకు దీటగునందురు శ్రీపరాంకుశా!

మధురకవిప్రశంసితసమంచితవైభవ! ద్రావిడాగమాం
బుధికుముదప్రియా! సుగుణపూర్ణ! మనోహరవాగ్విలాస! య
భ్యధిక కృపాలవాల! కురుకాధిపపాదసుసంగతాంతరం
గ! ధుత సమస్తపాతకనికాయ! శ్రితావన! శ్రీపరాంకుశా!

అకలుష తింత్రిణీ తరుబిలాంతరవస్థితులైన మీ సమా
ధికములు లేని తేజమున దిక్కు లవెల్లను నిండియుండఁగా
సకలజనంబు మీమహిమ సారెకు నెంచి కృతార్థులైరి నా
నిఁకఁ గొఱఁతేమి? మీపదములే గతిగాఁగొన శ్రీపరాంకుశా!

వేదము వేదమే? ద్రవిడ వేదము వేదమునుం బ్రబంధమున్
వేదసమూహసారమును వేదశిరోఽర్థనిరూపకంబు లో
కాదరభాజనం బగు సమంచితకావ్యము నయ్యె నిట్లుగా
నేది కొఱంత దీనిఁ బఠియించెడి వారికి శ్రీపరాంకుశా! 9

ష్క్రదములైనయోగ్యములఁ గూడవచించెను సంస్కృతాగమం
బీ ద్రవిడాగమంబు వెలయించెను ముఖ్యముగాఁ బ్రపత్తి నీ
మాద్రి రహిల్లునందున సమస్తజనంబుల కిద్దిగాక తా
మాదృగనన్యచిత్తులకు మాత్రమెయయ్యెను శ్రీపరాంకుశా!

బ్రహ్మముఖోద్గతంబయిన బ్రహ్మము భాగచతుష్ట యుక్తమై
బ్రాహ్మణులెల్ల వారలకుఁ బాఠ్యముగాఁ దనరారె ద్రావిడ
బ్రహ్మముమీముఖోద్గతము భాగ చతుష్టయయుక్తమౌచు స
ద్బ్రహ్మణులైనవారలకె పాఠ్యముగాఁబర[illegible]పరాంకుశా!

అర్యమతేజ! మీరలు గతాగతవేదులెకా! భవిష్యదా
చార్యులనెట్లు దెల్పుటకుఁ జాలితి రింతటివారె కానిచో
నార్యులు దాననే గద కృతార్థతఁ జెందిరి వారిపై మన
శ్చర్యల నిల్పి తా మితర సంగములన్ విడి శ్రీపరాంకుశా!

పదియును నారు వర్షము లభంగురనిష్ఠఁ దపంబొనర్చి మీ
రెదను రమామనోహరుని యెల్ల విభూతులు గోచరింప స
మ్మదమును జెంది లోనడఁగు మార్గము దానికి లేక వాక్యులై
యొదవఁగఁ జేసినారు సుఖ మొందఁగ మాదృశు
లోపరాంకుశా! 13

అవయవభూతులా పదుగు రార్యులు మీ కొగివార లిందిరా
ధవునకునాత్మభూతుల? యతండును ముక్తికధీశ్వరుండ? యి
ట్టివిధము నిక్కువంబయిన డెందమునం దిఁకడిందు టెందుకై
భవదురుపాదపద్మములఁ బ్రాప్యముఁగాఁ గొనినన్
బరాంకుశా! 14

దేహవిముక్తికిన్ బిదప దివ్యపదం బగునంచుఁ బల్క సం
దేహము మీకుఁ గల్గెనో ? యనేకభవంబులనుండి వంతలన్
వ్యాహతు లైరి గావున జవంబున మోక్షము గల్గకున్న నీ
దేహులు నిల్వలేరని సుధీజనవందిత! శ్రీపరాంకుశా 15

బ్రహ్మపదంబుఁ జెందెడి యుపాయములందుఁ బ్రపత్తి నాపర
బ్రహ్మము జూపియుండె సులభంబగుదానిఁగ మీరు ద్రావిడ
బ్రహ్మముచే రమావరుని వైభవమంతయు నానతిచ్చి యే
జిహ్మములేనివారి దరిఁ జేర్చినవారు గదా! పరాంకుశా 16

జనుల భవాభిముఖ్య మవిచాల్య మగున్ గద ద్రావిడాగమం
బునుబఠియించుమాత్రమున మోక్షము నొందెడివారిఁజూచి కా
దన కిది ఛావుపాట యని యాపగలోఁ బడవైచి రక్కటా!
కనరయి రెంతయున్ బ్రతుకు గట్టిది గాదని శ్రీపరాంకుశా.

హరి సిరికిన్ జమూపతికి నాయమ జెప్పిన మంత్రరత్న మీ
ధరణిని వ్యాప్తిఁ జెందెడి విధం బెదియంచును జూడ మీరు దు
ష్కరమగు నిష్ఠతోఁ దపమునల్పి♦ లభించితిరంట దాని మీ
కరుణను నాథయామున ముఖప్రముఖుల్ గొని రోపరాఁకుశా

♦ 'లభించు' వైష్ణవ పరిభాషలో సకర్మకముగా వాడు
సంప్రదాయము కద్దు.

మీవదనంబునుండియుఁ దమిన్ శ్రుతిరూపముగాఁబయల్పడన్
ద్రావిడ మేమి జేసెనొ? నహా! సుకృతంబును మీరలుండఁ జిం
చావరకోటరంబునకు సంభవమైన యదృష్ట మెట్టిదో
పావనశీల! యిట్లని యెనంచెఱుఁగున్ ధరణిన్ బరాంకుశా! 19

భాషలలోపలన్ ద్రవిడభాషయు దేశికులందు మీరలున్
శేషశయానుఁడున్ సురలఁ జేతనులందున నిత్యసూరులున్
దోషములందు భాగవతదూషణ మొక్కటె యంద్రు దాసహృ
త్తోషణ! రమ్య వాగ్విభవభూషణశోభన! శ్రీపరాంకుశా!

వేదములన్ బఠింపకయె వెల్లడిగా నొక ధర్మమైన ని
మ్మేదినిలోఁ దన్యయనచే బహుదుష్కర మంచు నెంచి మీ
రాదర మొప్పఁగాసులభమా గతి నన్నిటిఁ జెప్పఁగోరి యా
వేదము ద్రావిడంబునను వేగ నొనర్చితి
రో పరాంకుశా! 21

ఘనమతియైన నాథముని గాథతపం బొనరించి దేవరన్
గని ద్రవిడాగమంబును దగన్ లభియించెను గాని లేకయుం
డిన నెటు సంభవించు ధరణిన్ ననుఁబోలినవార లగ్ధా
జి నెఱఁగి యిందిరాధవునిఁ జేరఁగఁగాంచుట శ్రీపరాంకుశా! 22

తాను దరించి యన్యులను ధాత్రిఁ దరింపఁగఁ జేయు టుత్తమం
బౌ నను న్యాయముగ్ దలఁచి యార్యుఁడు నాథగురుండు
దాను మీ
పైన కటాక్షముగ్ బడసి యందరికిగ్ బడయంగఁ జేసె న
వ్వాని ఋణంబుఁ దీర్పఁగలవారమె యెన్నటికిగ్
బరాంకుశా! 23

మానముఁ బూనియెన్నఁడునుమాటలనాడనివారలౌ మిమున్
గానఁగ వచ్చి యామధుర కవ్యభిధానుఁడు బల్కరింపఁగా
వానినిజూచి పల్కితిరివాని యదృష్ట మదేమొ మీమదిన్
వానిపయిన్ జనించిన కృపారసమెట్టిదొ శ్రీపరాంకుశా ! 24

ఆతఁడెపో కృతార్థుఁడు శ్రీయామునుమీఁదగు దివ్యతేజమున్
బ్రీతిని గన్న మాత్రమున వెల్వడి దారియుఁదెన్నులే కదే
రీతిగ వచ్చెఁ గష్టమనురీతిఁ దలంపక యట్లువచ్చె నన్
హేతువుచేతనే మిముఁ గహించెను బ్రాపుగ శ్రీపరాంకుశా!

సంబరమొప్ప స్త్రీ యగుచు జన్మమునొందిన గోద గోపికా
త్వంబు వహించుకన్నవసుధాస్థలిఁ బూరుషులైనమీరు స్త్రీ
త్వంబు వహించియుంటిరల తామరసాయతనేత్రుఁగూర్చి చి
త్రంబగుఁగాదె! యిద్ది యుచితజ్ఞుల కారము శ్రీపరాంకుశా !

మీరలు స్త్రీస్వభావమును మీరక స్వామివియోగబాధ దు
ర్వారముగాఁ జరింప నల వారిజనాభుఁడు మిమ్ము నెమ్మదిన్
బూరుషు లంచు నెంచ కొక బోఁటినిగాఁ దలపోసి వచ్చె తా
నూరడిలంగఁజేసె నిది యున్ సరిపోవునె? శ్రీపరాంకుశా! 27

హరి పురుషుండుఁదక్క జగమంతయుస్త్రీకి సమానమంచు నీ
ధరణిని శాస్త్రవిద్వరులు దాముపచించెడిమాట మీమెడన్
అరయఁగసత్యమయ్యె హృదయంబున దీని గ్రహించువారలే
సరియగువార లంచును మెసం దలపోసెద శ్రీపరాంకుశా ! 28

ఏ రసమైనఁగాని జనియింపఁగఁ జేయఁగఁజాల దింపు శృం
గారరసంబు పోల్కినను గాథ గ్రహించిన మీరునాయికా
కారముఁబూని నాయకునిఁగా జగదీశ్వరు నిశ్చయించి యా
తీరె ప్రబంధ మంతటను దీర్చినవారుగదా! పరాంకుశా! 29

గాన మనంగఁ బ్రేమపడు కంసవిరోధి స్వభావ మెల్ల మీ
మానసమం దెఱింగి యసమానవచోవిభవంబుతో రమా
జానిగుణప్రభావమును సర్వము గానమునందె పాడి య
వ్వాని కృపన్ లభించితి రవార్యముగా నిల నో పరాంకుశా!

విమలచరిత్ర! మీపలుకు వేదములన్ ఘనవేదమై ప్రబం
ధములను సత్ప్రబంధమయి ధాత్రినిగావ్యములందు మంచికా
వ్యమునయి ధర్మశాస్త్రములయందు సమంచితధర్మశాస్త్రమై
యమరెను దీనిచేఁ దెలియ నట్టిది లేదుగదా పరాంకుశా! 31

భాగవతాళిలోఁ బరమభాగవతుల్ కవులందు సత్కవుల్
యోగుల యోగివర్యులు గురూత్తములున్ గురులందు
మీర లా
భోగిశయానువైభవముఁ బూర్ణముగా నెఱిఁగించి లోకులన్
బాగుగ నేలినారు భవబంధముఁ బాపి యిలన్ బరాంకుశా!

జ్ఞానము శక్తి విద్యయును సత్యము ధర్మము దైవభక్తియున్
లేని మనుష్యుఁడైన నొకలేశము మీకృప నొందియున్నవా
డేని భవాంబుధిన్ గడచి యీశ్వరసన్నిధిఁ జేరి మోక్షల
క్ష్మీనిధియై సుఖించు నని చెప్పెద రార్యులు శ్రీపరాంకుశా!

ఇలను రజఃకణంబులను నెన్నఁగవచ్చు నభంబునందుఁ దా
రల గణియింపవచ్చు మధురంబగు మీ కృతినెల్లఁబాఠమున్
సలిపి భవంబు దాటి హరిసన్నిధి కేగినవారి నెంచఁగాఁ
దలమగునే స్ఫురద్వకుళదామవిరాజిత! శ్రీపరాంకుశా! 34

నాస్థితిఁ జూచికొన్న మును నాకు విచారము గల్గు నిప్పుడే
స్వస్థుఁడ నైతి మీచరణపంకజసేవ లభించినందునన్
స్వస్థుఁడనై ననున్ నరకవాసినె యైన నిఁకన్ బ్రపన్నకూ
టస్థుల మిమ్ము నే మఱువ డగ్గఱ నన్యుల శ్రీపరాంకుశా! 35

మీ యభిమానమున్ బడసి మేటులలోఁ గడుమేటియయ్యెఁదా
నీ యిల నాథయోగి యతఁ డెంతయు శౌరికిఁ బ్రీతిభాజనం
బాయెఁ దదన్వవాయమున యామునసూరి జనించియుంట నా
రాయణు నాశ్రయింప విడ నాడెను సందియమున్
పరాంకుశా! 36

కడుఁ బ్రియశిష్యుఁడౌ మధురకవ్యభిధాను కవిత్వ మంతయున్
బుడమిని మీమహామహిమమున్ గొనియాడుటతోనె తృప్తినిం
బడి విరమించినట్లు దలఁపందగు నిట్టులె కాకయున్న నె
క్కుడఁ గనుపింపదే మతని కైత మఱొక్కటి శ్రీ పరాంకుశా!

ముక్తికి నాల్గుపాయములు ముఖ్యము లంచని రార్యులెల్ల నా
సక్తిని వానికన్న సుఖసాధ్యము గుర్వభిమాన మంచుఁ ద
ద్రక్తిని బోధఁజేయ మధురంబుగ నయ్యది దోఁచె నట్టి వా
గ్వ్యక్తయు దానిచే మధురకవ్యభిధన్ గనిమెన్ బరాంకుశా!

భోగము లీలయున్ గడపఁ జూపినవాఁడు మురారి దేశికుం
డాగతిఁ గాక భోగమునె యాతనికిన్ గలిగించు నందుచే
బాగుగ నాశ్రయింపఁ దగువాఁడు గురుం డని తోఁచు ముఖ్యమున్
గాఁగ వచించె నామధురకవ్యభిధుం డిదియే పరాంకుశా! 47

ఉగ్రుఁడు గాకయున్నను బయోధిశయానుఁడు శౌరి నిగ్రహా
నుగ్రహశక్తుఁ డౌటను మనోగత మెంచుచుఁ దా ననుగ్రహం
బే గ్రహియింపఁబోదు వచియించిన శాస్త్రము వ్యర్థమౌటయున్
ఈ గ్రహచార మిట్లగుట కించుక హేతువగున్ బరాంకుశా!

తనకు సహాయ మేర్పడినఁ దా నొసలన్ గరుణించువాఁడు గా
వునను గురుం డనుగ్రహమె పూర్ణముగాఁ గలవాఁడు వానిఁ దా
దునఁ బనికౌనో కాదో యని తోఁప దెవానికి శంక దీనినే
కని వచియించె నామధుర కవ్యభిధానుఁడు శ్రీపరాంకుశా!

ఆతఁడు దీని గుర్తెఱిఁగి యట్టి కృతిన్ రచియించెఁ గానె నే
యాతఁడె నాథయోగి మిమునింపుగఁ గాంచెను గాంచకున్నఁ బృ
థ్వీతలమందు మీ ద్రవిడవేదము గ్రమ్మఱ నెట్లువచ్చు నే
రీతిని మందబుద్ధులుఁ దరించెడివారలు? శ్రీపరాంకుశా! 4[illegible]

మధురకవీశ్వరుండుగద మాదృశులన్ దరిఁజేర్చు మార్గమున్
బ్రథమమునందుఁ జూపె నటుపై నది సాగెను నాథమౌనిచేఁ
బృథివిని వీర లిర్వురు లభింపకయుండిన నన్నుఁబోలువా
రథములలోఁ గరం బథములై చెడకుందురె శ్రీపరాంకుశా!

రుచిరములట్లు దోఁచిన స్వరూపవిరుద్ధములౌ నుపాయముల్
ప్రచురముగా గ్రహింపను ఫలాప్తి విఘ్నలటంచు నెంచి మీ
రెచటఁ బ్రపత్తియోగమునె యింపుగ నెల్లడిఁ జేసియుంటి ర
ప్రచలితవైభవా! హతభవప్రభవా! ప్రభువా! పరాంకుశా!

అన్ని యుపాయముల్ తెలిపినప్పటికిన్ నియతాధికారవై
చెన్నగు సంస్కృతాగమము శ్రీకరమౌ ద్రవిడాగమంబు వి
ద్వన్నుత! తాఁ బ్రపత్తి నొకదాని వచించినదైన నెల్లరున్
గ్రన్నన నాశ్రయింపఁదగి క్రాలె విచిత్ర మిదో పరాంకుశా!

అకట భవాభిముఖ్య మిది యందరి కాశ్రయణీయమైననున్
సుకముగ దీనిఁ గైకొనక చొచ్చెద రన్యములందు నెందరో
స్వకలుష మిద్ది యంచనక చాల నిషేధముఁ బల్కుచుంద్రు దీ
నికి నిఁక వారికేగతి జనించెడినో గద శ్రీపరాంకుశా! 48

మత్తమతంగరాజ మొగి మార్గమునం జనుచుండ శ్వానముల్
చిత్తము రేఁగ వెంటఁబడి చింబరవందరలాడి యార్చినన్
ఉత్తముఁ డెవ్వఁడైన నిది యొప్పునె? నవ్వనుగాని యట్లె ధీ
సత్తమ! యెవ్వరేమన విచారముమీకగు? శ్రీపరాంకుశా!

త్వష్ట యొసంగు శాపమును బాపికొనెన్ మునిరాజగస్త్యుఁ డు
త్కృష్టభవత్కృపారసము నించుకఁ జెందఁగఁగల్గియుండుటన్
గష్ట మగస్త్యశాపము జగంబున బాయుట యంచు నెంచి యా
త్వష్ట ప్రయత్నమే సలుపఁదాఁ దలఁపండుగదా! పరాంకుశా!

ధామణిఁ గ్రుంగఁజేయఁగల దార్ఢ్యముగల్గిన యాయగస్త్యుఁడే
మీ రుచిర ప్రసాదముఁ దమిన్ మదిఁ గోరెడివాఁడు గాఁగ నె
వ్వారికి నింకమిమ్ము గడువంగఁ దరంబగు నిట్టి మీకథన్
ఆరయ కేగదా చెడుటకైరి కుబుద్ధులు శ్రీపరాంకుశా! 49

స్థిరమగు నిష్ఠ నన్యజనదృష్టిని సైపని వైష్ణవుల్ భవ
త్పరమపదోత్సవంబు జరుపంబడు కోవెలలందు నిత్యమున్
బరఁగెడ రోడ్లదర్శనము స్పర్శనమున్ సహియించియిద్ది మీ
యురుతర వైభవంబుగద యోగుణసాగర! శ్రీపరాంకుశా!

హరివసియించునాలయమునందురు ప్రాకృతమంచుమీరెటన్
బరఁగెడ రట్టియాలయముఁ బల్కెద రార్యులు దివ్యదేశమం
చరయఁగ దీని నాహరికినైన భవత్కృతమా ప్రభావమే
ధరణి నటంచు నాకు విదితంబుగఁ దోచెను శ్రీపరాంకుశా!

ద్యుమణులు వేవు రొక్కపరిఁ దోఁచిన నెంతటి తేజముండు శ్రీ
రమణుని తేజమంతదని ప్రాజ్ఞులు పల్కెద రట్టి దివ్యతే
జమునకు నందరాని దట తావ్యస్థలి నీయురు తేజ మిద్ది యే
క్రమముననింతదంచుఁబలుకంగఁ దరంబగు? శ్రీపరాంకుశా!

మీ వచనంబులందె మితిమీఁంచి సుగంధము గ్రాలునంచనన్
మీ వకుళప్రసూనచయ నిర్మితదామమునందు లేదనం
గా వశమౌనె? యొక్కపరి ఘ్రాణము దాని గ్రహించెనేని నిం
కేవిధి నన్యవాసనల కిష్టముఁ జెందును శ్రీపరాంకుశా! 53

మధురతరోక్తిగుంభనల మాదృగసీసుల పంపు మానస
వ్యసనలను రూపుమాపితిరి ప్రాజ్ఞుల మంచుఁ దలంచి కొంద రే
విధమున మిమ్ముఁ జేరక వివేకముచేఁ జెడుచున్నవారు దు
ష్పథములనాశ్రయించి యిఁక వారల నేమనఁ బరాంకుశా!

తానుగ వచ్చి మీకు నుచితంబుగ సంస్కృతులెల్ల విష్ణుసే
నాని యొనర్చిపోవఁగను నాథమునీంద్రుఁ గ్రహించిపూరలున్
వానిని జేసియుంటి రల ప్రాజ్ఞవరేణ్యుఁడు నస్మవాటులున్
గానఁగఁ జేసెఁగా క్రమముగా హరి మెచ్చఁగ శ్రీపరాంకుశా!

మీ యుపదేశమున్ బడసి మేలును జెందగఁ వచ్చుఁగాదె నే
నాయది యన్న భావన మనంబుననుండి తొలంగఁద్రోసినన్
ఆ యభిమాన ముండువఱ కందఁగ లేఁ డొకఁడైనఁగాని ని
శ్శ్రేయస మెన్నికష్టములఁ జెందినఁగాని యిలన్ బరాంకుశా!

నే ననుకొన్నమాత్రమున నే నరుఁ డందఁడు ముక్తినంచనన్
దాని పరాత్పరుండ నని భ్రాంతిఁ దలంచిన నింకఁ నెగ్గుచే
మానసమందు రాజభటమాత్రుఁడు కార్యనియుక్తుఁడైనమా
త్రానఁ బ్రభుండ నేననుట ధర్మమదెట్లగు శ్రీపరాంకుశా! 5

వకుళవిభూషణా! వినుఁ డవశ్యము నేనొకమాట జెప్పెదన్
వికచసరోరుహం బనఁగ వింపుము మీచరణద్వయంబు దా
ని కసితభృంగ ముండవలె నే నొకఁడౌటను దానిఁగాగ నా
దు కలుషమానసంబుఁ గొన దోషమడంగును శ్రీపరాంకుశా!

తేనియఁ గ్రోలి వేరొక ప్రదేశముఁ జేరెడి భృంగమట్లు నీ
మానస మేగునే నెపు యాని మాకగు సందియమంచు రేని మీ
దైన పదాబ్జమందు రస మూనెనె .యెన్నటికైన నారఁబో
దేని భవత్పదాంబుజము నెల్ల విడున్ మది శ్రీపరాంకుశా!

క్షుద్రముగానఁ బంకజము శూన్యమగున్ మకరందమందు న
క్షుద్రముఁ బాట మీ చరణమానము లెప్పటికిప్పు నిర్గళ
త్క్షౌద్రములై యొసంగునటుఁ గావున నా హృదయద్విరేఫ మే
మాద్రిఁ దృణించు? వాని ననుమానముఁ గేటికి శ్రీపరాంకుశా!

మురహరు సన్నిధిన్ బొనలు ముక్తిని పున్నము లౌను నేని మీ
చరణసరోరుహంబుల రసంబున కౌను విపత్తియైననున్
గరమును క్షుద్రమౌ మనసుఁ గాంచిన సందియ మున్న దాని
వేరరుగక యుండఁ గట్టుఁడు దయాహ్వయరజ్జువుచేఁ
బరాంకుశా! 61

కారికులంబు మీకుదయకారణ మయ్యెను దింత్రిణీతరు
శ్రీసహకారరం బుచిత దేశము నయ్యెను మీరలుండ న
ప్మ్రరమఃఖండు మీ కవిత మెచ్చెడి పండితుఁ డయ్యెఁ గాని శ్రీ
కారయు డాసుఁ జేనయితి నౌనిది చిత్రము! శ్రీపరాంకుశా!

సకలజగన్నియంతయగు శౌరి భవన్మధురోక్తు లాలకిం
చి కడుఁ బ్రసన్నుఁ డయ్యెనని చెప్పఁగనే విని నేఁడు నేను నా
దుకతినవాక్కులన్ మిముఁ బ్రతుష్టులఁ జేయఁగవచ్చియుంట ల
జ్జకయిన. జంకనైతి నపచారమొ చేసితి శ్రీపరాంకుశా! 63

నాకిటు వాకు గల్గుట యనర్థమొ యయ్యె నదేమి యన్నచో
మీకడ నిట్టిరీతి మితిమించిన ప్రేలుడుఁ బ్రేలుచుంటినే
మీకిది చాల కష్టమని మిన్నకయుండెద మన్న నిల్వఁగా
లేక యె యుంటి బొంకనఁగ లేదవకాశము శ్రీపరాంకుశా !

తనవశమైన మార్గమునఁ దాను గుణానుభవంబుఁ జేయఁగా
ననువగు నూరకుండిన నిరర్థకమై చెడు మర్త్యజన్మ మం
చును దలపోసి యీసరణిఁ జొచ్చినవాఁడను మీపదంబులన్
మనసుననిల్పి స్తోత్రమొక మాదిరిఁ జేయఁగ శ్రీపరాంకుశా !

ఒకపరియైన మీ మృదుతరోక్తుల నెల్ల సమగ్రభక్తి పా
డుకొనఁ బఠింతునేని భవదుస్తరవారిధి దాటవచ్చు నం
చకలుషచిత్తులై విబుధు లానతియీయ నెఱింగి వచ్చితిన్
ఇఁక నది మీదయన్ గలుగ నీయఁగ వేడెద శ్రీపరాంకుశా !

గ్రంథము లెన్నిఁటిన్ జదువఁ గల్గిననున్ బరిపూర్తి లేదు నా
యంధమతంబునన్ విడువ దంచు నెఱింగినవాఁడ సద్యశో
బంధుర! మీప్రబంధమును బాఠముఁ జేయఁదలంతుసత్కృపా
సింధువులైన మీకరుణఁ జేకురనౌనది శ్రీపరాంకుశా ! 67

వేదము వేదమంచు మును ప్రీతి వహించి ఋగాదివేదకున్
బాదరజంబుమాడ్కి విడువం దుది నర్థమటన్నవా రెటుల్
వైదికులౌదురో పరమ వైదికులౌదురు గాని యెప్డు మీ
వేదమునే పఠించెడి వివేకవతంసులు శ్రీపరాంకుశా ! 68

ఒరులకుస్వప్రమాణమయి యుండెడి వేదము ప్రాతికూల్యమున్
జరపెడిదాటచేఁ బదరజంబటు వీడఁగనయ్యెగాని యీ
పరమపదాభిలాషులకుఁ బద్ధతి యట్టిది గాకపోవుటన్
నిరతము వీరి కిద్ది పఠనీయమె యయ్యెను శ్రీపరాంకుశా! 69

వైదికులన్న పేరు విడువందగుఁ వేదముఁ గాదటన్నచో
వేదము నాశ్రయించినను ఖేదము దప్పదుగాన రెంటిలో
నేదియు నిర్ణయార్థమయి యేర్పడనందున నట్లునిట్లు దు
ర్వాదముఁ జేయుచుందురిది భావ్యమనందగునే? పరాంకుశా!

ధరను బ్రమాణమూలమునఁ దాను ప్రమేయమునిశ్చయించుటే
సరణిగనుండ నిర్విఘ్న మసంభవ మయ్యె నదెట్టులన్నచో
నరయఁ బ్రమాణమే విడువ నర్థమటంచనినన్ ప్రమేయమే
కరణి లభించు నిట్లనినఁ గల్గదె? దోషము శ్రీపరాంకుశా! 71

ప్లవమున నేరుదాటి పిదపన్ ద్యజియింపఁడె దాని నట్లె వే
దవచన మాశ్రయించి పరతత్త్వముఁ జెంది త్యజించుదీని నాఁ
బ్లవమునముందు బాధ గను పట్టు నిటన్ గనపట్టు దాట న
ట్లు వలుక నెట్లువీలగు నలుత్తగుణోదయ! శ్రీపరాంకుశా! 72

ప్రౌఢిమగల్గియున్న మునివర్యులు శాస్త్రములందు నన్నిఁటన్
గూఢము గాకయున్న హరిఁ గూర్చిన ధ్యానమె ముఖ్యమ—
న్కథన్
గాఢముగా వచించి రది గైకొని మీకృతియందు మీరలున్
మూఢులకైననుం దెలియు పోల్కిని బల్కితి రో పరాంకుశా!

అరయఁగ సంస్కృతాగమమునందుఁ బరత్వమనేకలందు నో
చరమగు నవ్విధంబును విచారణఁజేసి సమన్వయింపనా
హరియెపరాత్పరుండనుచు నంతట మీనిగమంబువాకొనన్
దరతమభావ మియ్యదియె దానికి దీనికి శ్రీపరాంకుశా! 74

ఆ నిగమంబునన్ జదువ నల్పమతుల్ హరిదౌ పరత్వమున్
మానసమం దెఱింగెడి సమర్థతలే కయథార్థభూతమౌ
జ్ఞానముఁ జెంది యన్యులకు స్వామ్యముఁ బల్కుచు
మోక్షమార్గమున్
గానకయుండి భాష్యలు ప్రకాశముఁ జేసి ననుంబరాంకుశా!

ఇంతియెగాక కొందరు రమేశుపరత్వ మెఱింగి రే నుపా
యాంతరముల్ రుచించియు ఫలాంతరముల్ మదికెక్కియున్
సుఖం
బెంతయులేక దుర్గతుల కేగుచునుండిరి మీరు దీని నా
వంతయుఁ జేరనీయరుగదా! భవదీయమునన్ బరాంకుశా!

హరియె పరాత్పరుండు శరణాగతియొక్కటియే యుపాయమై
పరగు నపేక్షణీయమగు వస్తువు మోక్షమెయైనన్ ఫలాం
తరములు వానియంత నవితప్పక గల్గునటంచు మీరు దే
వరనిగమప్రబంధమునఁ బల్కినవారలు శ్రీపరాంకుశా! 77

కర్మము జ్ఞానభక్తులు జగంబునఁ జక్కఁగ నాచరించినన్
శర్మము గల్గునే కొంచెత సంభవమైన విపత్తిహేతువౌ
నర్మిలి నిట్టిదోషము రవంతయు లేనిదిగా ప్రపత్తి స
ద్ధర్మముగాను దాని విదితం బొనరించితి రోపరాంకుశా! 78

మును నిగమాంతసారముఁ బ్రభూతమనీషుఁడు వ్యాసుఁడంత
తా నొనరిచె సూత్రరూపమున నొప్పఁగ మీరలు సూత్రసారము
ల్లను ద్రవిడాగమంబున నిలన్ వచియించితిరంట మీమతం
బున నె యతీంద్రుభాష్యమును బుట్టినదంటగదా పరాంకుశా!

వీనికి నైకమత్యము వివేకులు వల్కఁగ దానిఁ గాదటం
చూని ప్రపత్తి జెప్పఁబడు చున్నది ద్రావిడవేదమందు రా
మానుజభాష్యమందుఁ దెలియంబడుచున్నది భక్తియందు ర
క్తైన యతీంద్రు వీరలును నాప్తు లెటౌదురు? శ్రీపరాంకుశా!

మీరును భాష్యకారులును మేదిని నేకమతంబువారనం
గా రస మొప్పఁగాని యిది గాదని వేఱుపథంబుఁ బల్కు నె
వ్వారలకున్ రుచించుఁ బ్రతివాదులు దీని నెఱుంగ రేయనన్
వార లెఱింగియున్న నిటుఁ బల్కెడివారలె? శ్రీపరాంకుశా!

ఇరువురిపై గురుత్వ మొద నెంచెడివారల కుర్వి వారలి
ద్దఱొకమతస్థులైన శుభదంబగుఁ గాని విరోధ మున్న నే
కరణి సుఖంబు భాష్యమునఁ గ్రాలెడి భక్తి ప్రపత్తియోగత
త్పర మనినన్ విరోధమిఁకవచ్చునె? యెన్నటికిన్ బరాంకుశా!

యతిపతి భక్తియంచు శరణాగతిఁ బల్కిన హేతువేమనన్
ఇతరులతోడి వాదమగు టింతయెగాక మరేమిలేదు భ
క్తతతి ప్రసాదమన్నదియు కా పరులందున నన్నమంచనన్
హితమగు లేనిచోఁ దెలియనేర్తురె? వారలు శ్రీపరాంకుశా!

వివిధపదంబు లొక్కట వివేకముచే సమకూర్పకున్న నె
ట్లవును సమన్వయంబు నిబుధాళి యెఱుంగనిదౌనె?యీపథం
బవని ప్రపత్తి మోక్షకర మంచును మీరువచింప భాష్యకృ
త్ప్రివరులు భక్తియట్టిదని పల్కెడివారలె? శ్రీపరాంకుశా! 84

ముక్తికి సాధనం బనుచు భూమిఁ బ్రపత్తినిదప్ప నెవ్వరున్
భక్తిని బల్కరాదొ? యని పల్కనఁ గర్మము జ్ఞానయోగ మా
సక్తిని జొచ్చువారలకు సైతము మోక్షముగల్గునంచు సు
వ్యక్తముగాఁగ శాస్త్రములువల్కెయున్నవె? శ్రీపరాకుంశా!

నాలుగు మోక్షదంబులయినన్ సుకరంబు స్వరూపసిద్ధమై
క్రాలుఁ బ్రపత్తియంచు నిదెగైకొని రార్యులు మీరు దానినే
చాల బ్రశంసఁ జేసితిరి స్వామియతీంద్రులుఁగూడ దానికీ
జాలినదేది లేదనుచు స్థాపనఁ జేసిరి శ్రీపరాంకుశా! 86

వరదుని యారువార్తలఁ బ్రపత్తియె మోక్షదమంచునుండ నే
కరణిని దానిమాని యతి కాంతులు భక్తిని బల్కువారు గ
ద్యరచనయందుభాష్యమునఁ దామువచించినదాప్రపత్తియన్
సరణిని వారుదెల్పిరిఁక సందియమెట్లగు? శ్రీపరాంకుశా! 87

వారటు బల్కియుండినను వారికి శిష్యులె యయ్యుఁగొందరిం
పారఁ బ్రపత్తిఁగైకొనమి కారయఁగారణమేమిమానవన్
శౌరికటాక్షవీక్షణ మసంభవమాటయె గాక వేరుగాఁ
గారణ మేమియుండునని కైకొనవచ్చును శ్రీపరాంకుశా! 88

హరికళఁ బుట్టి తత్సఖుఁడు నాతనిచుట్టము వాని ప్రాణమై
పరఁగెడి పార్థుఁడే యల ప్రపత్తిని ముందుగ నాలకింపఁగా
ధర నధికారిగాక బహుధర్మగుహ్యులన్ వినెనన్న నింక నె
వ్వరి కధికారమౌ హరికృపన్ లభియింపక శ్రీపరాంకుశా!

మిమ్ము మహాత్ములంచెఱిఁగి మీపదసేవ యొనర్చువారె న్యా
సమ్ము భవన్మతంబని యశక్తుల కద్ది యుపాయమన్న లో
కమ్మున దీనితో సమముగాఁ గనుపించెడి దోషమున్నదే?
నమ్మెడివారె? వీరి వచనమ్మెవరైనను శ్రీపరాంకుశా! 90

వీర లశక్తు లేమనక బింకపుఁ బల్కులఁ బల్కి రే నహం
కారము వీరికున్నటులెగా యిదియుండిన ముక్తి యెట్లు జే
కూరు నశక్తి కియ్యకొనఁ గూడునె? వీరు ప్రపత్తిమాని యి
ద్ధారుణి భక్తియోగమునఁ దాము చరింపఁగ శ్రీపరాంకుశా!

వారును మేముఁ దుల్యమగుభంగిభవత్పదముల్ భజింపఁగాఁ
గారణమేమి! మీకనువుగాఁ గనుపించుఁ బ్రపత్తి మాకుఁ జే
కూరఁగఁ జేసి వారికది గూడనిదంచుఁ దలంపఁ జేసి యు
న్నారలు వారు మీకరుణ నంద ననర్హులో? శ్రీపరాంకుశా!

పూర్వ భవార్జితంబయిన పుణ్యములేమిఁ బ్రపత్తి దూరులై
యుర్విఁ జరించుచున్ దమ యయోగ్యత నెంతయుఁ
గప్పిపుచ్చ దు
ర్గర్వముచేఁ బ్రపత్తి యెడఁ గల్మషవాక్కులఁ బల్కుచుండినన్
సర్వజనంబులున్ దెలియఁ జాలకె యుందురె: శ్రీపరాంకుశా!

కనుగొనఁ 'దామునింగినదె గంగ' యటన్నవిధంబుగాను మీ
రొనరఁగ భక్తిఁ జాముఁ గొనియుంకుట సద్వియెముఖ్యమంత్రముగా
ని నిజముగాఁ బ్రకృష్టత గణించిన భక్తియెయూఁ బ్రపత్తియం
చు నెఱుఁగజాల రేమనిన సొంపగు? వారలశ్రీపరాంకుశా!

వారలు మీమతంబగు ప్రపత్తిని మారుటచేత ఘోరమౌ
నారక మెందువారలో యనారతమున్ భవదంఘ్రిపద్మసే
వారతులై చరించుట శుభంబును జెందెడి వారొయంచు నే
నారసి నిశ్చయంబుఁ గనని నిజంబుగ శ్రీపరాంకుశా! 95

మీ రవతారమూర్తులని మేముదలంచి భవన్నివేదితం
బౌరసఁ బైతృకంబునను నింపుగ నర్పణఁ జేయుచుండఁగా
వా రలభంగిఁ జేయరట వారికిఁ దోచినదోషమేమొ యె
వ్వారి కెఱుంగ శక్యమగు నైరిగజాంకుశ! శ్రీపరాంకుశా!

మనుజశరీరు లంచనిమెుమానుగ విప్రులుగారటంచునో
ఘనమున మిమ్ము నెంచిననుమాత్రతపచారముగాదె? యింతెగా
కనువుగ రామకృష్ణులకు నర్పితమైన ప్రసాద మేవిధం
బున నుపయోజ్యమౌననిఁ బోవలె నూరకె శ్రీపరాంకుశా!

విష్ణునివేదితాన్నమునె విన్బఁ బ్రమాణ మటన్న రామునిన్
గృష్ణునిఁ జెప్పలేదుగద కేశవమూర్తులె వారునందురా
వైష్ణవమూర్తులంచు గురువర్యులఁ బల్కు- ప్రమాణకోటి దో
చిష్ణువుగాఁగ వేరుగతిఁ జెప్పగశక్యమె? శ్రీపరాంకుశా! 98

ఐనను రామకృష్ణులటు లాప్యులనున్ భగవత్పదంబునన్
మ్యానుగ నుంచుఁడీ యనఁ బ్రమాణవిరుద్ధముగాన నాగతిన్
బూనము చేయనిచ్చుటను బొందుఁడి యుత్తరమున్గ దానినం
దేని బదుల్ వచించుటకు నేమిక్రమంబగు శ్రీపరాంకుశా !99

గురువులకున్ నివేదనముఁ గూర్పక స్వామినివేదనంబు నే
సరణిని బూర్తిఁజేయుటకు శక్యముగాక యెయుండ వీర లె
ట్లరయఁగ దీని మధ్యమున నాపిమెనర్చెద గన్యకృత్యమున్
సరియగునే యటుల్ సలుప సద్గుణశోభిత ! శ్రీపరాంకుశా !

తీర్థమునుం బ్రసాదమును దీసికొనం బరిపూర్తియాఁగదా
వ్యర్థముకాదె మధ్యమునఁ బైతృకమున్ జరుపంగ నన్నచో
నర్థములేదు దీనికెటులన్నను బెద్దలకీకముందె తా
నర్థి గ్రహింపవచ్చునె పదార్థము దేనిని శ్రీపరాంకుశా ? 101

ఇచ్చక్రమంబె యాచరణి నేర్పడియెన్ బితృవాసరంబునన్
మచ్చికమైఁ బితాళ్ళు ప్రథమంబున నీఁదగువారలంచు వి
ద్వచ్ఛయమెల్ల దీనికి నుదాహరణంబులఁ బల్కెనెన్నియో
హెచ్చులు వీరలింక వచియింపఁగవీలగునే? పరాంకుశా! 102

స్వామిసమర్చమధ్యమున భంగముఁజెందుటయుర్ బితాళ్లకున్
స్వాములకున్ నిజార్యులప్రసాదము లభ్యముగాకయుంటయున్
ఆమెయిఁ గర్తయుం జెడుట యాదిగ దోషము లెన్నియో
యగున్
భూమిని వీనిఁ దీర్చుకొను పోకడయెట్టిదొ ? శ్రీపరాంకుశా !

హరి కపచారమున్ జలుప నార్యులచేత నివర్తనీయమౌ
గురువుల పట్లనేరమునకున్ వెనుదీయనివాని కెవ్వరున్
శరణముగాఁగఁ జాలరని శాస్త్రములెల్ల వచించుచుండఁగా
నెఱుఁగరొ? తా మెఱింగియును నిస్తరింతురొ? శ్రీపరాంకుశా!

హరివలెఁ గాక మీరలు దయారసనాథులుగాన వీర లే
కరణిఁ జరించుచుండిన నొకానొకనాఁడయినన్ భవత్పదా
బ్జరతిని జెందువారలను సైతము బ్రోచెడివారలంచు నే
నెఱిఁగితి మీకటాక్షమున నెందరొ చెప్పఁగ శ్రీపరాంకుశా!

పెద్దలు మీమహత్త్వమును బెద్దదిగా వచియించుచుండ నే
నిద్దియె నిశ్చయంబనుచు నెంతయునమ్మి భవత్పదంబు లే
ప్రొద్దు మనంబునన్ నిలిపి పూజ యొనర్పఁ దలంచినాఁడ నా
కద్దియె యెప్పుడున్ గలుగ నట్లొనరింపుఁడు శ్రీపరాంకుశా!

బాల్యమునుండి మీదగు ప్రబంధము నధ్యయనంబుఁ జేయ ని
స్తుల్యుడనైతి నంచు మదిఁదోఁచి కడంగెదగాని యద్ది సా
కల్యముగాక యున్నయది కారణమేమొ మదీయచిత్తచాం
చల్యముఁ బాపి దీనిఁ గొనసాగఁగఁ జేయుఁడు శ్రీపరాంకుశా!

అన్నా నినట్లు లీకృతి సమగ్రతనందెఁ గొఱంత లేదు న
ల్లాన్ని లచక్రవర్తిపద లక్షితుఁడన్ దిరువేంకటార్యుఁడన్
గాన్క గ నిచ్చుచుంటి శతకంబిది మీచరణంబులందు నా
యున్నిఁదలంపబోఁక దయయుంచుఁడు నిత్యము శ్రీపరాంకుశా!

సంపూర్ణము



నల్లాన్ చక్రవర్తుల వేంకట రాఘవాచార్యులు

# కవిపరిచయం

జననము 1900 సం. కాపురము తుని. వృత్తి వైద్యము. సంస్కృతాంధ్ర ద్రావిడాంగ్ల భాషావిశారదులు. ద్రావిడ వేదసారమగు వేయి పాశురముల తిరువాయిమొళిని వీరు కేవలము పదిమాసములలో

"ప్రాలేయాచల గహ్వరోపరిగళత్

భాగీరథీవీచికా లీలాగ్రాలు" నట్టి తమ సరసకవితాశైలిలో "శఠకోప గీతామృత"మను పేర ననువదించి 1942 సం.లో ప్రకటించిరి. అందలివే ఈ పద్యములు. ఈ నడుమనే శ్రీ భాగవతమునుండి కపిలదేవహూతి సంవాదమును "కాపిల సాంఖ్యము"ను పేరుతో 300 పద్యములలో ననువదించిరి. వీరు రామకృష్ణపరమహంస వలె భగవత్సాక్షాత్కారమునందిన మహాభక్తులు.

# శఠకోప గీతామృతము

## మూడవ శతకములో 9 వ పది

సర్వపురుషార్థ ప్రదుఁడగు సర్వేశ్వరునే స్తుతింపవలెను.

ఇది చెప్పంగ విరుద్ధమౌ నయినఁ గానింజేనునున్ బూని చె
ప్పెద నాలింపుఁడు భృంగరమ్యాంకితశ్రుతులతోఁ బల్కొప్పు
శ్రీ వేంకటా
ద్రి దొరన్ నాయుపకారి, నాదొరయు, నా దేవుండు
వాఁడుండ, ని
చ్చెదనే? మానుకజిహ్వాగ్ర కవితాశ్రీ నేను వేఱొండ్లకున్.

కొలనుల్ మాన్యములు తటన్ వెలయ గన్గోనందమైవంద్యమై
తలకన్యైన ♦'తిరుకన్న ఱుంగుడి' యథార్థజ్యోతిఁగొల్వున్న నా
కులనాథుం బతి, మాని తా మొతను బాగుల్ జూచి మిత్తైకు మ
ర్త్యులపై వ్యర్థులపైఁ గవిత్వములఁ గూర్పుల్ సేయ
నేమయ్యెడున్ ?

ఒక తెంపొప్పక కల్ప కల్పముల త మ్మొప్పారఁగా నిల్పు కీ
లక నందించెడు దేవతాప్రభువు మ్రోలంగాక విద్వాంసు లొం
డొక చోటం జని యొక్క ప్రాకృత మనుష్యున్ గొప్ప
కబ్బంపు పొం
దికఁ గొండాడిస్వరూపహీనులయి దేనిం బ్రోవుఁగావింతురో?

---

♦ గ్రామనామము.

మతిధనులార! యస్థిరుల మానవుల న్నుతిఁ జేసి గాంచు గాం
క్షిత ధనమెంత? దాననగు సిద్ధి యదెంత? యదెన్నినాళ్లు సం
గతమగు? రత్నమాళి, సురకాంతు నుతింపఁ దనంతవారిఁ జే
సి, తనిపి, జన్మపాశములఁ జించి, స్వకీయులగోష్ఠిఁ జేకొనున్.

సిరిఁ గల వెంటకుప్పలనుఁ జేతనులం గొనియాడ యోగ్యమై
పొరసెడు లబ్ధిలేదు కవి పుంగవులార! త్వదీయ సత్యమున్
దొలఁగుదు రంతెఅస్వాఁడును దోషవిహీనుఁడు, కామదాత, కా
మ రహితుఁ డట్టికృష్ణుపయి మావిభుపైఁ గవనంబుఁ జెప్పుఁడీ!

ఘన కవులారరండి! నిజకాయము వంచి భుజప్రయాస జీ
వనము నొనర్పుఁ డీయిల ప్రవాహముభంగి ననిత్యమిందులో
ధనికులు నేడు లేమియును తథ్యము కైతల చేత నిష్టదే
వుని స్తుతియింపుఁ డానుడియుఁ బొందును నా విలసత్కిరీటునిన్

తగు నీవిన్ గడుకొన్న కీర్తి విరివొందదన్ వేయి పేర్లొందు నా
దగు దైవంబును తప్ప వేఱొకని, విద్యాహీను, భూజన్ము, న
ల్ప గుణాంధున్, దృణితున్, గరాబ్దుఁడనుచున్, బ్రస్ఫార
దోఃపర్వతుం
డగు వాఁడంచునుఁ బచ్చి కల్లలను నేనాడంగలే నెయ్యెడన్.

వెదురులకన్న జెన్నయిన బెళ్కుబుజాల్ గల రాధనాథు పే
రొదవు ననేక దివ్య సుగుణోన్నతిఁ బాడి దినాలఁ బుచ్చి మేన్
వదలి తదీయపాద నలినంబుల క్రింద వసింపఁ గోరు నే
నెదియున నేర్తు? నానుడుల నీమనుజాళిని, భంగురాంగులన్.

జనులకు నాకులన్ గృతులుసెప్పి యొసంగు కవీశ్వరుండ గా
ను, నుతగుణుం డుదారుఁడు, ఘనుండగు చక్రికె
నాదుకైత కాం
తినిఁ గల యైహికార్థమిడు దివ్యపదంబును నీవ చూచి కొ
మ్మని పరికించి పొంచి పరమాత్ముఁడు మోక్షముఁ గూర్చు
నాకుఁ దాన్.

పలునాళ్ళుండియు నుండి గండువడు సంసారంపు దేహంబు చం
చలమై వచ్చుచుఁ జచ్చు చుంటఁ గనినైనన్ జన్మ
బంధంబుః బో
దలఁచున్ వీఁడని సైచు స్రష్టకుఁ గవిత్వంబిచ్చు నాకీపయిన్
గలదే ? యెన్నటి కొండు మానవుని పై కబ్బంబులన్
జెప్పఁగన్.

ఒగిఁ బెనుకీర్తిఁగన్న త్రిదశోద్వహు భక్తకృపాళు పేరిటన్
నొప్పగిఁ బెనుకీర్తిఁగన్న 'కురుకూరుశఠారి రచించు సూక్తిపై
యొగిఁ బెనుకీర్తిఁగన్న ద్రవిడోక్తి సహస్ర మాలలో
నొగిఁ బెనుకీర్తిఁ గన్న పదియున్నవి నేర్చిన జన్మవిధ్వసన్.

## నాల్గవ శతకములో 5 వ పది

శ్రియఃపతిపై కవిత చెప్పగలవారికి ఏలోపమును కలుగదు.

ఓలగ మొప్పనున్న భువనోత్తమ శాసనశీలు సన్మహీ
పాలు తురంగ రాక్షస విభంజను నాపతి సన్నుతించి కెం
గేలు మొగిడ్చి మ్రొక్కు తెసగించి మనోహరశబ్ద మాలికా
జాలము నిచ్చికోఁదగిన సంపదఁ గంటి నికేమి లోటగున్.

నీల విశాలనేత్ర, రమ, నిత్య నివాసము సేయు పేరెదన్
గ్రాలెడు వాని, పెద్దలను నా నేత్రముల గన్నులనాని దేవతా
పాలకు గాఢపుంగయిత గానల మాలలఁ బూజఁ జేసి యీ
నేలఁ గల్గిన క్షేత్ర సరణిన్ సడలించితి భాగ్యమెట్టిదో!

అవిరళ నిత్యమోద చరమావధిఁ దేలెడు నచ్యుతున్ గుణా
ర్ణవు, నళినాక్షు, దివ్యజన నాయకునిన్ గల కాలమున్ వచః
ప్రవిమల గాన మాలికలఁ బ్రస్తుతిఁ జేసిన భాగ్యశాలినై
యవిరళ నిత్యమోద చరమావధి నేను సోలలాడితిన్.

తన్ను ననన్యులై కొలుచు దాసుల కోసము భూలఁగాఁగినన్
గొన్న పదున్ విహంగ తురగున్ సమిమధ్యక చక్రహస్తు వా
గున్నత గాన మాలికల నొప్పి నుతించిన భోగ భాగ్య సం
పన్నుఁడ నాదునాత్మఁ బరమాత్మ గొలిచ్చిన గెల్లులుంగుదున్.

అనుగుణభంగి ధర్మపథ మూఁదగ నొప్పుగఁ జూపు దేవతా
జనపతి, యెల్ల యర్థముల జాటినవాఁ డుపకారి యట్టి స్వా
మిని, కలుషంబు, వ్యాధులు సమీర జవంబున నాలశబ్దమా
లనురచియించి కొల్చి విపులంబుగఁ గొంటిదినంబు మోదమున్.

కను నలపాపమైఁ జలువ కప్పురపుంబోడి రవ్వ యొప్ప పెన్
గను సొగ సొందువాఁడు సురనాథుఁడు శ్రీపతి వాని నర్థవా
జ్ఞయతిని గాన మాలికలఁ గీర్తనఁ జేసిన గణ్య పుణ్య వ
ర్ధనుఁడను నాకు నీపయి సదా లభియింపని వస్తువుండునే?

ఎల్లపు డేమిటం దయని సీతన హెచ్చైన నోంము లేని నాఁ
డెల్ల జగాల నేలికొను సీపులు వానిని నద్దుఁ బెట్టి చే
ర్వేళ్ళను కొంత నెత్తికొను శ్రీపతికిన్ శుభ శబ్దమాల భా
సిల్లగ నిచ్చు భాగ్యముఁ జేసిన నాకొక లోపమున్నదే?

మనసున్, బున్నాగపురంబుఁగొను పద్మాదేవి కానంద మి
చ్చును భూమిస్థులకుం దివస్థులకు సేవింపొను శీతాబ్జ పీ
ఠని విష్టాంఘ్రితలున్, జగజ్జనకు జాడల్ చాటుపాటల్ సువా
క్య నిరూఢిన్ రచియించునాతు పరమాకాశస్థులున్ సాటియే?

దివి దివిదాలునాదట, క్షితిన్, క్షితి క్రింద తలంబు, నష్ట ది
జ్ఞ వహాము నొక్కెడ న్వడక నిండిన వానికి, వక్ర శంఖమున్
వివృత కరంబునం గొనెడు నేలువనకున్ ఘటనృత్యమూర్తికిన్
గవనముఁ జెప్పు నర్హతనుఁ గాంచితి నాకిక మాఱు లేదెటన్.

క్రమింగియు నుమ్మియుం గొలిచి పాదకుఁ దేలిచి పవ్వళించి చ
క్కఁగను నిల్చె. భూషణ వికాసముతో దయచేసి కౌఁగిలిం
తంగడుఁ గూర్చి భూపతిని తాన వహించెడు దేవునైజ మొ
ప్పంగసురియింపగ నోచితిని వైష్ణవ హర్షక శబ్దవర్షమున్.

సారపు వానల న్మిన్నులఁ జల్వగు సుందర వేంకటాద్రి నొ
ప్పారెడు సామికిం గృతిగ నంబుసమృద్ధ వనాలెసంగు కు
ర్గూహున కారిమాఱ' నగనొప్ప శఠారి రచించు నిప్పదిన్
నేరుచువారి పాపముల నిండ వాసిని తీర్చి ప్రోచెడిన్.

# ఏడవ శతకములో 9 వ పది

తమ్మిశెట్టి కవి తానంపన నిచ్చిన జగదీశ్వరునికి చూపగల కృతజ్ఞతయే యిది.

కలకాలమ్మును సాగు కాలముల నన్ గారామునన్ సాకి నా
కలఘు స్వీయవివేకమిచ్చి తన యుద్గ్రంథంబు నాచేత గా
వులుఁ గుల్కం ద్రవిడంబునం బొనరు చొప్పుం జేసె
సంతుష్టుండు సు
జ్ఞాలుఁ డాప్యుండిఁక నేమిఁ జెప్పికొని నిల్వన్ వచ్చు? ప్రత్యర్థమై
తానే యిప్డు మదాత్మ నానొకటియై పై వాఱి నాపల్కులన్
నేనేఁ బల్కిన నవ్యకావ్యమను భంగిన్ వెల్లడిం జేసి స్వీ
యానూనోక్తులఁ దానెదన్ బొగడుమా యావర్తి మూర్తిత్రయే
శానుండాద్యుఁడు నాకు వశా బలుకు నే జూడన్ బమల్
దీర్చెదన్?

ఇతఁడే మూలమటన్న జ్ఞానమును నా కిప్పించి నా జిహ్వపై
కుతుకం బొప్పఁగనుండె చొచ్చి రసవద్గ్రాస ప్రబంధంబుఁ బా
వితులున్ ముఖ్యులునైన భక్తులకుఁ దృప్తిం గూర్పఁతన్ దానికీ
ర్తితుఁడౌ మత్కృతికారకుం డితని మూర్తిన్ నేమఱఁగా
నేర్తునే?

మఱతునా? యెన్నఁడేనియును మానవు నప్పను
నన్నుఁబ్రోచ్చి యే
నెరసులు లేని కైత సరణిం దనయంతనఁ జెప్పి పాప దు
ర్భరు నను బైకిఁ దీసి స్వకృపాకమనీయ కటాక్ష వీక్షణన్
బఱుచుచు నన్నుఁ బ్రోచెడు స్వభావమెఱింగి యెఱింగి
యూపయిన్

శీలరమన్ గ్రహింపుటకు శిక్షితమునె సలక్షణంబు ర
మ్యాలపనంబునై భగవదర్హమునైన కవిత్వ భంగికిన్
జాలని జ్ఞానహీను నను స్వప్రతిమాను నొనర్చి నా వచో
జాలము నుర్విపైఁ బఱచు, చంద మొనర్చె నదెట్టి ప్రీతియో!

పరను కవీశ్వరుల్ మధురపాటవ చిత్ర కవిత్వచాతురీ
నిరతులునుండ స్వీయ మహనీయ చరిత్రము వారికైత చే
త రచనఁ బొంద కిప్పుడు ముదంబున నన్విడకుండి నాకె నా
పరమ పదాఖ్యనేత నిజ భవ్యకవిత్వముఁ గూర్చెఁ గూర్చెడిన్.

వైకుంఠాధి విభుండు నాయకుమునున్ భంగించు శుద్ధుండు నన్
జే కొన్నాఁడు, తనంత వానిగను నాచే స్తుత్యుఁ డౌచుంటనే
వైకుంఠుండగునట్లు, స్వీయ విషయ ప్రాంచత్కవిత్వాప్తశు
ద్ధా కారుండగునట్లు, లెంచె నతనిం ధ్యానించినం దీరునే? 29

తగకున్న న్ననుఁ దాసమానునిగ సంధానించి నాచేత ఖ్యా
తి, గడింపం దనుఁగూర్చి మంచికయితం దీరారఁ జెప్పించె నీ
మొగమాటంబున కాత్తచక్రుఁడగు నాముఖ్యేశుసత్కీర్తి భూ
గగనస్థాఖిలభావ మూని పొగడంగా నైన సంతృప్తియే? 30

మఱపును లేని నన్ దన సమానునిఁ జేసి స్వకీయగాథఁ బల్
తెఱఁగుల తీయకబ్బములఁ దేలుచు నా వలనన్ బొసంగఁ గా
నెఱపెడి నిట్టి సత్కృతికి నిత్యసమృద్ధుని విష్ణు సద్గుణో
త్కరమును నెల్లకాలముస్తుతంబు నొనర్చిన నాకుఁ దృప్తియే?

ఇఁక మాటెయ్యది వాని సత్కృతికి? లేదే యాత్మనాఁ
జిత్తగిం
చి కనంగా నిపుడాత్మయు న్మిగులకా శ్రీదేవు సాత్తమ్యో స్వీ
య కృపాబోధక సాధుమంజుల కవిత్వారంభుఁ గావించు సా
మికిఁ జేయఁగ బ్రతి యొండొకింతయును
భూమి న్నింగినిం గల్గునే? ౩౨

సోపాధిక బంధువులను వదలి నిరుపాధిక
బంధువగు పద్మనాభునే యాశ్రయింప వలయును.

కొనుఁ బెండ్లాములుబిడ్డలాప్తులునుఁదక్కంగల్గుఁజుట్టాలుఁ గ
న్గొను సల్లప్పుడెకూర్తు రొండపుడు పొందుల్ జార్తురప్టాశలం
దునుఁ గ్రిందఁగ బయినున్న యన్నిఁ దనయందుఁగ బొందు
పద్మేశు భ
క్తిని జీవించుట తక్క దిక్కుమరి యేదీ? మీకు లేదేసుఁడీ.

చెలులున్ రక్షకులట్లు పట్టుకొనుచున్ జేఁజిక్క మేలున్నచో
జలగల్ పోలిక జ్ఞాతి బంధువులు పైసాఁ బీల్తు రేకాత్రు ని
ర్దళి తోత్పాటిత సప్తసాలు, మన, యభ్రశ్యాముని నితగా
గొలువన్ బూనిమనుండుతక్కునవి బొంకుల్ వ్యర్థసంబంధముల్.

పైసాచేతులఁ జెల్లుచుంటఁ గని నిన్ బాగుండ దీవించి నీ
వాసన్ జేతులు మోడ్చి నిల్తురు తమోవంతుం డనఁ తాపదా
యాసుండైన దరిద్రుఁ జేకొనరు దైత్యధ్వంసిఁగృష్ణున్ హరిన్
దాసత్వంబునఁ గొల్చుజీవనము కన్నన్ రక్ష వేఱున్నదే?

సిరిఁ గోల్పోయిన నాఁటి కాదురనుచున్ జేపట్టు చుట్టాలు పో
దురువంచించిఋణానుబంధులటు లంతున్ బొందినోయంతె పా
మరుల న్వీడకుఁడీ యుదఙ్మధుర జన్మంగొన్న శ్రీకృష్ణు నే
శరణంబంచు మనంబు కొండొక యుపాస్యంబేది లేదేసుఁడీ.

తమ కార్యజ్ఞతఁదావె మెచ్చికొని పొంతన్ దేనియల్ జిల్కు వా
క్యములన్ బల్కెడు స్త్రీలతో మఘుక భోగంబందువా రాదట
న్యమునుం గందును భీకరాసురులఁ జెండన్ బుట్టు శ్రీకృష్ణు దా
స్యముఁ జేపట్టి మనంబు లేమ: సుఖమవ్యం బంతకన్నన్ జుఁడీ.

అరయన్ లేదుసుమండి! సౌఖ్యమననిత్యానందముధ్యానింప కెం
దఱోమున్ బుట్టియుఁ గిట్టిరింపగు పురాణక్షేత్రమైయున్న యు
త్తర సీమన్ మధురం జనించు హరి పూతంబైనశీలంబు సం
స్మరణంబొంది మనంబు కొండొకటి సూక్ష్మంబైన
త్రోవున్నదే ?

చేరన్ వేఱది లేదు చెప్పితిమి సంక్షేపించి యీభూమిలో
వారెవ్వారు శ్రమింపనేల? స్మరియింపం జాలునంచీరుఁ గ
న్నారయ్యా! యొకతప్పుఁగాదుమనకృష్ణస్వామిగోవిందుసత్
చారిత్రంబునె యభ్యసించి దినముల్ సాగించుటే మేలగున్.

ఇటు జీవించుటె మీకునుం గుణము సుండీ! యయ్యో!
మాయార్థలం
పటుపాదా ల్వినుతించి నాళ్లుగడుపన్వాంఛించి, స్వార్థంబునుం
గుటిలత్వంబును లేనివారి మనుపన్ బుట్టొందు శ్రీకృష్ణు ప్రా
కటశీలంబె శరణ్యమంచుఁ గొనుమార్గంబొండె మేలన్నిఁటన్!

దానికి మిన్న లేదనుచు దానినఁ బల్మఱుఁ జెప్పి యెంచుచున్
వీనులఁ బెంచివించుఁ గడువెల్తిగఁ దొల్లిఁటి చెన్నుఁ బోవఁగన్
బూనుదు రంబరధ్వజ విభూషితమా మధురన్ జనించు శ్రీ
జాని హరిప్రియాంచిత భుజమ్ముల వాఁడొకరుండ ప్రోచెడిన్.

హరికంటెన్ బరమైన శరణ్యమిఁక లేదంచున్ నిరూపింప భూ
భరముల్ మాన్పఁగ నుత్తరంపు మధురన్ బ్రాపించి తాఁ బుట్టె మీ
సిరి 'కృష్ణార్పణమస్తు'టంచుఁ గని యుజ్జీవింపుఁడీ సందియం
బారయం బోకుఁడి వానియర్థము లెకావో? యన్ని లేవన్యముల్.

## —: ప్రకీర్ణకము :—

మీరలు మీయది యనునది వేఱు మొదలు నూడఁ బెరికి
విశ్వేశ్వరునిన్
జేరుఁడి ఆత్మలకంతకు మీరిన యాధిక్యమేది? మేలొడఁ
గూర్చున్. 19
మనసును, వాకును, గాయము ననఁబడు మూఁడింటి ఫలము
నారసి వీనిన్
మును మున్నే లోఁగఁబఱచి కొనుమా! నీసామిఁ జేరి
కొనుమా విసతిన్. 20

మెయికిన్ గూరుకురాక రేఁబవలు సామిన్ జక్రిగా మించి త
ద్దయకున్ దవ్వయి శీతలానిలము! సంతాపింతు వెక్కాలమున్
వియదంభోధిధరా ధరాధరము, లన్వేషించి సేవించ లే
కయ ఘోరా! మావలె నీవునున్ విరహదుఃఖావాప్తి శోషింతువే!

తేనియ, పాలు, నేయి, సుధ, తీయనిచక్కెర మేళవించుచున్
బానముఁ జేసిన ట్లనుభవంబగు నామధుసూదనుండునున్
నేనునుఁ గూడి కూడి కమనీయరసంబులఁ దేలి యాడ నో
మానసమా! శరీరమున మంచితనంబున నీవు నిల్చుటన్. 121

పోయెడు కాలమున్, గడచిపోయినకాలము, వచ్చుకాలమున్
నాయెడఁ దల్లిఁదండ్రివయి నాకగునాత్మవయా సుస్వామి! లో
కాయతకీర్తి! సౌరభ సమంచితశ్రాను విలాసమూర్తి! నిన్
బాయఁగ నెట్టులోర్తు? భువనత్రయ రక్షక! భక్తరంజకా!

కలఁడెచ్చోహరియన్న పిన్న నుడువున్ ఖండించి యెచ్చోటనున్
గలఁడా? యంచునుఁ గంబమున్ విసువ నక్కంబంబునం బుట్టి ని
స్తులరోషాప్తి హిరణ్యుఁ జక్కడఁచె నోద్దామానృసింహుండు త
ద్బల మాహాత్మ్యముఁ బొను కాదనుచు వాదా? యెంత
హాస్యంబగున్! 179

మున్నీరుల్ గల నేలఁ జేసిన మదంభోదాంగ! యానాడు ప్రీ
తిన్ నీవిచ్చిన మేనులోనఁ బడి భ్రాంతిన్ దిక్కుచున్నాఁడ, నా
పన్నాలెన్ని దినాలు నాయఘము దుంపన్ త్రెంపి
మాయింపవో
యన్నా! నిన్విడనోప నింక నిను నాకందింపు వేనాటికో!

కులముల్ నాల్గిఁటి కంటె హీనులవివేకుల్ చండ చండాల జా
తులవారైన సువర్ణనాంచిత భుజున్ ద్యోతేంద్ర నీలాంగు దా
సుల మంచుఁ మదినమ్మరేని యలదాసుల్, వారి సేవించు దా
సులునున్ వారల దాసులు న్మనకు పూజ్యుల్ స్వాములున్
నిచ్చలున్. 269

భాసిత పాదముల్ గొలిచి వర్తిలు భూసతి నారగించి స్వ
గ్రాసముఁ జేసి యాకుపయి వ్రాలిన నిస్తులబాలు మత్ప్రభుల్
దాసతఁ గొల్చువారలకె దాసులు గాదఁగు వారి దాసులౌ
దాసుల దాస దాసతతి, దాసుల దాసుల మేము నిచ్చలున్.

అంగనలార! చాలమృదువైనది బాలిక యేమిఁ జెప్పినన్
లొంగదు నాకు రొమ్మున వెలుంగులనీను సరాలసంగు ర
మ్యాంగునిఁ గృష్ణు పాదగతమౌ తులసీదళమాల చాలమేల్
బంగరు సొమ్ములున్న తన వక్షముపై గొనఁగోరి పొక్కెడున్

మనసొక చోటఁ బెట్టి పయిమాట కుదార! మణిప్రకాశ! యం
చును నొక కొన్ని బూటకపు సొట్ట కబుర్లనుఁ బల్కి నిన్నె వం
చనఁ గొను బుద్ధిపోయె నినుజాలఁ గనుంగొని మంటి, పాలవె
ల్లిని శయనించు సామి! విడలే నిటుపై నిను దేని కోసమున్.

మిన్నున నున్నవారలును మేదిని వారలు నాసఁ జేయు సం
పన్నుఁడె వచ్చి నామనసుఁ బట్టెను నాకిక మచ్చెకంటి, వి
త్తోన్నతి, సత్సుతుల్ మిగుల నొంచి నాపయిఁ గూర్మి సేయుసన్
గన్న మదంబ, మత్పితయు నాసకలంబును నాతఁడేయగున్.

కలిఁగల తారుమారెడయఁగాఁ గృతకాలము వచ్చి నిత్య సూ
రులు తమయంతఁ జొచ్చునటు రూఢ ముదంబుధి పొంగునట్లు మ
బ్బుల జగి, సంద్రఘూర్ణరహీయుఁ బొల్చెడు శ్రీపతి భక్తులుర్విపై
వెలయుచుఁ బర్విగానముల విశ్వములం దరియింప సేయుతన్.

తనసాపాటును మంచితీర్థ మటుపై తాంబూలమున్ గృష్ణుఁడే
యనుమం గన్గవ నీరుఁ గార్చుచిలలో నా దేవుశేలంబు లా
తని చెల్వొప్పెడునూరి శ్రీవడుగుచుం దాఁజొచ్చెనాబిడ్డదూ
కొని యేదివ్యపురంబొ అయ్యది 'తిరుకోళూరై'యై తీరెడున్

తేజఁగొను విష్ణుదేవుడన్ దేఁటితినగ।
నాదు స్త్రీత్వసుమంబు జీర్ణత్వమొందె
వగలడంగక నాత్మలోఁ బొగులుకొనియె।
సాయమింతయు నా మనసీయకుండె. 884

మేపికొనుచుండునపుడు నీమీఁదవచ్చి।
యసుర సేనలు పోర నేమగునో నీక
టంచు మాయాత్మభీతిల్లి యగ్గిచేర్పు।
మైనమటుల కరగి దహ్యమాను కృష్ణ! 927

చేరనె చేరదు పాపము। నీలాపూరాభ్రనిభవినీలుని పెంపౌ
పేరుస్మరించెడువారెై వ్వారైననువారమర్త్యవరులౌదురుపో.

దయనొందందగు దాసస్త్తములకుం దాసుండ నాయందునన్
దయఁజేయన్ బనిఁబూనె చక్రి; యదియున్నా యిచ్ఛమై
జేయు; నీ

పయినీభూమినిఁ బుట్టఁగోర; మనసా! పై బాయు మజ్ఞాన మొ
వ్వియునడ్డంకుల గట్టిపెట్టికొలుమా!విష్ణ్వంఘ్రి'వాట్టారునన్.'
మంచిమనస్స! పాపమయ మానసుఁడైన హిరణ్యురొమ్ము చే
దించిన ప్రోడ తేడులు మోదింజెదరం దురమందుఁ బొండురా

ట్పంచ సుతార్థ మాయుగముఁ బట్టిన మా పతి లోనసుండి గా
వించెను తాను ద్రావిడ వేదము మేదిని నాదయార్థమై 954
ననువంచింపకు మింక నీయుడిమునన్ మాలాగతిన్ గంక పూ
ర్తిని జొప్పిల్లెడు గొప్పకొప్పుగల యా శ్రీయాన నీయాన క

న్గొనుమీ! నేస్తముఁ జేసినీకుమఱి నాకున్ స్వాత్మభేదంబు మా
యను నోకేభంగింగక గొంకు లేఁగొనినావయ్యా! ననున్ బిల్వవే?

సంపూర్ణము

## గోదా గ్రంథమాలకు విశాళమొసగిన ఈ ఉదారులకు మా స్వామి సకలాభీష్టము లొసగి కాపాడుగాక!

## గ్రంథ ముద్రాపకులు



| | రూ. అ. పై. |
|---|---|
| 1. శ్రీమతి కొండూరి తిరుమల ఆండాళమ్మగారు. | 250-0-0 |
| 2. శ్రీమతి కాండూరి లక్ష్మీనరసమ్మగారు, శ్రీమన్నారాయణపురం | 300-0-0 |

## శాశ్వత పోషకులు

| | |
|---|---|
| కోట సుందరరామశర్మగారు, M. A., M. O. L. M. Ed. Ministry of Education. న్యూఢిల్లీ. | 116-0-0 |

## పోషకులు

| | |
|---|---|
| శ్రీమాన్ ఎ. టి. కె. వెంకట తాతాచార్యులుగారు, పెద్ద కాంచీపురము. | 25-0-0 |

## సభ్యులు

| | |
|---|---|
| 1. శ్రీ దోనేపూడి సీతారామయ్యగారు, ఘంటసాల. | 15-0-0 |
| 2. శ్రీమతి కాండూరి రంగనాయకమ్మగారు, శ్రీమన్నారాయణపురం. | 10-0-0 |
| 3. శ్రీ పెద్దిరెడ్డి వీరరాఘవయ్యగారు, విజయవాడ. | 10-0-0 |
| 4. శాస్త్రి వీరభద్రరావుగారు, ఘంటసాలపాలెం. | 10-0-0 |

5. శ్రీ గొర్రెపాటి బాపనయ్యగారు, ఘంటసాల. 10-0-0
6. శ్రీ సూరపనేని కోటయ్యగారు, తాడేపల్లి. 10-0-0
శ్రీ వి. వి. కృష్ణారావుగారు, ఎమ్.ఎ., యల్. యల్. బి.
ఘంటసాలపాలెము. 10 0 0

## అభిమానులు

1. శ్రీ మూలుప్వారి సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు, తెనాలి. 6-0-0
2. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల వేంకటరాఘవాచార్యులుగారు,
తుని. 6-0-0
3. శ్రీ బొందలపాటి శివరామకృష్ణగారు, విజయవాడ. 5-0-0
4. శ్రీ జి. వి. చలపతిరావుగారు, మల్లవోలు. 5-0-0
5. శ్రీ కోట వెంకయ్యగారు, కోడూరు 5-0-0
6. శ్రీ పరుచూరి బుచ్చికోటయ్యగారు, కోడూరు 5-0-0
7. శ్రీ కోట చినఅంజయ్యగారు, కోడూరు 5-0-0
8 శ్రీ బడే పూర్ణచంద్రరావుగారు, ఉల్లిపాలెము దివితాలూకా 5-0-0
9. శ్రీ బడే రామనాధరావుగారు, ఉల్లిపాలెము " 5-0-0
10. శ్రీ బడే బసవయ్యగారు, ఉల్లిపాలెము " 5-0-0
11. శ్రీ సిద్దినేని సుబ్బారావుగారు, ఉల్లిపాలెము " 5-0-0
12. శ్రీ సిద్దినేని అంజయ్యగారు, ఉల్లిపాలెము " 5-0-0
13. శ్రీ సిద్దినేని శ్రీరామయ్యగారు, ఉల్లిపాలెము " 5-0-0
14. శ్రీ బడే నాంచారయ్యగారు, ఉల్లిపాలెము " 5-0-0
15. శ్రీ బడే వెంకట్రామయ్యగారు, ఉల్లిపాలెము " 5-0-0
16. శ్రీ సిద్దినేని ధనరాజారావుగారు, ఉల్లిపాలెము " 5-0-0
17. శ్రీ దారపరెడ్డి వీరరాఘవయ్యగారు, ఉల్లిపాలెము " 5-0-0
18. శ్రీ ఘంటా వేంకట్రామయ్యగారు, ఘంటసాల 5-0-0

19. శ్రీ గొర్రెపాటి వేంకటరాయలుగారు, ఘంటసాల 5-0-0
20. శ్రీ వేమూరి పేరయ్యగారు, ఘంటసాల 5-0-0
21. శ్రీ డాక్టరు అబ్దుల్ రఖీబ్ సాహెబుగారు, ఘంటసాల 5-0-0
22. శ్రీ కాకాని పట్టాభిరామయ్యగారు, ఘంటసాల 5-0-0
23. శ్రీ తుమ్మల నరసయ్యగారు, కొడాలి 5-0-0
24. శ్రీ కంచెర్ల కోటయ్యగారు, కొడాలి 5-0-0
25. శ్రీ బి. వి. నరసింహారావుగారు బి. ఎ. బి. ఇడి., వెంటపాడు 5-0-0
26. విద్వాన్ శ్రీ గర్రె సత్యనారాయణగుప్తగారు, విజయవాడ 5-0-0
27. శ్రీ పి. రంగస్వామిగారు, విజయవాడ 5-0-0
28. శ్రీ రామకృష్ణా రైస్‌మిల్లువారు, మంగళగిరి 5-0-0
29. శ్రీమాన్ తి. గు. అంతర్వేది నరసింహాచార్యులుగారు, రేపల్లె 5-0-0
30. శ్రీమాన్ శృంగారం శ్రీనివాస రంగాచార్యులుగారు, శ్రీకాకుళం 5-0-0
31. శ్రీమాన్ దీవి వెంకటాచార్యులుగారు, అవనిగడ్డ 5-0-0
32. శ్రీమాన్ అగ్నిహోత్రం నరసింహాచార్యులుగారు, మొవ్వ 5-0-0
33. శ్రీమాన్ దీవి వేంకటనృసింహాచార్యులుగారు, నల్లూరు 5-0-0
34. శ్రీ కోనేరు సీతారామయ్యగారు, బార్లపూడి 5-0-0
35. శ్రీ నైలవరపు సూర్యనారాయణమూర్తిగారు, కృష్ణంపాలెం 5-0-0
36. శ్రీ సొలస కృష్ణశాస్త్రిగారు, బందరు 5-0-0
37. శ్రీమాన్ తట్టా శ్రీనివాసాచార్యులుగారు, బందరు 5-0-0
38. శ్రీమాన్ యస్. టి. యల్. పెరుమాళ్ళాచార్యులుగారు, బందరు 5-0-0
39. శ్రీ మాదిరెడ్డి సుబ్బారావుగారు. బందరు 5-0-0
40. శ్రీమాన్ బుర్రా రాఘవాచార్యులుగారు, బందరు 5-0-0
41. శ్రీ చందూరి శివరామశర్మగారు, ఎం. ఏ., బందరు 5-0-0
42. శ్రీ దావులూరి కృష్ణయ్యగారు, ఘంటసాల 5-0-0
43. శ్రీ తుమ్మల వేంకటరామయ్యగారు, ఘంటసాల 5-0-0

| | |
|---|---|
| 44. శ్రీ వేమూరి వేంకటకుటుంబరావుగారు, ఘంటసాల | 5-0-0 |
| 45. శ్రీ వేమూరి వేంకటరామయ్యగారు, ఘంటసాల | 5-0-0 |
| 46. శ్రీ బండి నరసయ్యగారు, ఘంటసాల | 5-0-0 |
| 47. శ్రీ గొర్రెపాటి లీలాకృష్ణయ్యగారు, ఘంటసాల | 5-0-0 |
| 48. శ్రీ తుమ్మల వేంకటేశ్వరరావుగారు, ఘంటసాలపాలెం | 5-0-0 |
| 49. శ్రీ వేమూరి రత్నయ్యగారి కుమారుడు రామయ్యగారు, ఘంటసాలపాలెం | 5-0-0 |
| 59. శ్రీ పండిత వేమూరి వేంకయ్యగారు, ఘంటసాలపాలెం | 5-0-0 |
| 51. శ్రీ వేమూరి రామయ్యగారు, ఘంటసాలపాలెం | 5 0 0 |
| 52. శ్రీ తుమ్మల గోపాలరావుగారు, కొడాలి | 5 0 0 |
| 53. శ్రీ వెంపరాల రామస్వామిగారు ఎం. ఎ., మహోపాధ్యాయ గుడివాడ | 5 0 0 |
| 54. శ్రీ ఇవటూరి సుబ్రహ్మణ్యంగారు, వాడపల్లి | 5 0 0 |
| 55. శ్రీ కావూరి కోదండరామచౌదరిగారు, మోపిదేవి | 5 0 0 |

# శ్రీ గోదా గ్రంథమాల

## సభ్యత్వ వివరము:

1. గ్రంథ ముద్రాపకులు:

   గ్రంథవ్యయము సర్వము భరించువారు

2. శాశ్వత పోషకులు:

   ఒకేసారి రు 116-0-0 విరాళము నిచ్చువారు

3. పోషకులు:

   ప్రతి వత్సరము రు 25-0-0 ఇచ్చువారు

4. సభ్యులు:

   ప్రతి వత్సరము రు 10-0-0 ఇచ్చువారు

5. అభిమానులు:

   ప్రతి వత్సరము రు 5-0-0 ఇచ్చువారు

సూచన:—దాతల పేర్లు కృతజ్ఞతా పూర్వకముగ గ్రంథమున ముద్రింపబడును.

శ్రీగోదా గ్రంథమాల ప్రథమపుష్పము 'అంజలి' ప్రతులు లేవు

బాలసాహితీ ప్రచురణలు – ప్రథమ రత్నము:

**మీరాబాయి:** (చరిత్ర) వెల 50 నయాపైసలు

కర్త: హిందీ విద్వాన్

శ్రీ మిక్కిలినేని సుబ్బారావు

## రాబోవు గ్రంథములు:

1 భ్రమరగీతలు (పద్యకావ్యము) మూలము: హిందీకవి సూరదాసు
అనువాదము: శ్రీ "మధురకవి" మల్లవరపు సూర్య నారాయణమూర్తి, ఆంధ్ర తులసీ [illegible] కర్త

2 నారాయణ శతకము "సంగీత సాహిత్య కళానిధి" శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

3 శ్రీ రామానుజ చరిత్ర మూలము: ప్రపన్నామృతము
అనువాదము: శ్రీ కే. టి. యల్. నరసింహాచార్యులు "సాహిత్యరత్న; భాషాప్రవీణ"

4 రామదాసు చరిత్ర శ్రీమతి పాడిచేటి నవనీత కృష్ణమ్మ.

ప్రతులకు:

**కొండూరి లక్ష్మీనరసమ్మ**

వ్యవస్థాపకురాలు:

**శ్రీగోదా గ్రంథమాల**

శ్రీ [illegible]రము

[illegible],

[illegible], కృష్ణాజిల్లా